భాగవత సాధన

తెలుగు భాగవతాంర్గత

# ఋషభోపాఖ్యానము

సంకలనం

భాగవత గణనాధ్యాయి

సౌజన్యము : telugubhgavatam.org

శ్రీలలితంపు భూతియును శేష విభూషణమున్ శిరంబు పై

వేలుపు టేరు పాపటను వెన్నెల పాపఁడు మేన గొండరా

చూలియుఁ గేల ముమ్మొనల శూలము నీలగళంబు గల్గు నా

వేలుపు శ్రీమహానగము వేలుపు మాకు ప్రసన్నుఁ డయ్యెడున్.

# అనుక్రమణిక



## కథా సూచన

తపోధనుల, రాజశ్రేష్ఠుల చరిత్రలు శుభకరములు, సంతోషదాయకములు. చక్కటి సజ్జీవన మార్గదరశకత్వం చేయుట లో అత్యంత ముఖ్యమైనవి. కనుకనే, మన పురాతన ప్రామాణిక గ్రంథాల యందు ఉల్లేఖించబడినవి.

స్వాయంభువ మనువు పుత్రుడు ప్రియవ్రతుడు. ఈయనకు భార్య బర్హిష్మతి యందు కలిగిన పుత్రులలో జ్యేష్ఠుడు అగ్నీధ్రుడు. ఈయన జంబూద్వీప అధిపతి, భార్య పూర్వచిత్తి. వీరి పెద్ద కుమారుడు నాభి. ఈయన నాభివర్షాధిపతి, భార్య మేరుదేవి. వీరికి పుట్టిన వాడు మన కథా నాయకుడు ఋషభుడు. ఈయన భార్య జయంతి, శతమన్యుని పుత్రిక. వీరి వందమంది లో ప్రథమ పుత్రుడు మూడు జన్మలలో మోక్షం పొందిన భరత చక్రవర్తి.

గొప్ప రాజోత్తముడు, తపోధనుడు అయిన ఆ ఋషభుని చరిత్ర మన భాగవత సాధనలో చదువుకుందాం.

ధర సింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయము లెల్ల వందిగణమై బ్రహ్మాండ మాగారమై
సిరి భార్యామణియై విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్రియై
వరుసన్ నీఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా!

శ్రీరామ

తెలుగు భాగవతాంతర్గత భాగవత సాధన

# ఋషభుని జన్మంబు

5.1-1-క.

శ్రీకర కరుణా సాగర!

ప్రాకటలక్ష్మీ కళత్ర! భవ్యచరిత్రా!

లోకాతీతగుణాశ్రయ!

గోకులవిస్తార! నందగోపకుమారా!

టీక:- శ్రీకర = శ్రీకృష్ణ {శ్రీకర - శుభకరమైనవాడ, శ్రీకృష్ణ}; కరుణాసాగర = శ్రీకృష్ణ {కరుణా సాగర - దయాసముద్రుడ, శ్రీకృష్ణ}; ప్రాకటలక్ష్మీకళత్ర = శ్రీకృష్ణ {ప్రాకట లక్ష్మీ కళత్ర - ప్రాకట (ప్రసిద్ధమైన) లక్ష్మీదేవికి కళత్ర (భర్త), శ్రీకృష్ణ}; భవ్యచరిత్రా = శ్రీకృష్ణ {భవ్య చరిత్రా - దివ్యమైన వర్తనలు గలవాడ, శ్రీకృష్ణ}; లోకాతీత = శ్రీకృష్ణ {లోకాతీత - భువనములకు అతీతమైనవాడ, శ్రీకృష్ణ}; గుణాశ్రయ = శ్రీకృష్ణ {గుణాశ్రయ - త్రిగుణములకు ఆశ్రయమైనవాడ, శ్రీకృష్ణ}; గోకులవిస్తార = శ్రీకృష్ణ {గోకుల విస్తార - గోకులమునకు వృద్ధికారక, శ్రీకృష్ణ}; నందగోపకుమారా = శ్రీకృష్ణ {నంద గోప కుమారా - నందుడనెడి గోపకుని పుత్రుడ, శ్రీకృష్ణ}.

భావము:- సంపదలను కలిగించే శ్రీకృష్ణా! దయాసముద్రా! లక్ష్మీదేవికి భర్తవు అనే ప్రసిద్ధి కలవాడా! దివ్యమైన నడవడి కలవా

5.1-41-ఆ.

నరవరేణ్యుఁడైన నాభి సంతానార్థ
మంగనయును దాను యజ్ఞపురుషుఁ
డయిన వాసుదేవు నతుల భక్తిశ్రద్ధ
లను జెలంగి పూజ లొనరఁ జేసి.

టీక:- నర = నరులలో; వరేణ్యుడు = ఉత్తముడు; ఐన = అయిన; నాభి = నాభి; సంతాన = సంతానము; అర్థమున్ = కోసము; అంగనయున్ = భార్య; తానున్ = తను; యజ్ఞ = యజ్ఞమునకు; పురుషుడు = భర్త; అయిన = అయిన; వాసుదేవున్ = విష్ణుదేవుని; అతుల = సాటిలేని; భక్తి = భక్తితోను; శ్రద్ధలను = శ్రద్ధలతోను; చలంగి = విజృంభించి; పూజల్ = పూజలను; ఒనరన్ = చక్కగా; చేసి = చేసి.

**భావము:-** రాజైన నాభి తన భార్య అయిన మేరుదేవి సమేతంగా సంతానం కోసం శ్రద్ధాభక్తులతో యజ్ఞపురుషుడైన వాసుదేవుణ్ణి పూజించి...

5.1-42-వ.

మఱియుం బ్రవర్గ్య సంజ్ఞికంబు లగు కర్మంబులు శ్రద్ధా విశుద్ధ ద్రవ్య దేశ కాల మంత్రర్త్విగ్దక్షిణా విధాన యోగంబులం బరమేశ్వరుని మెప్పించిన నెవ్వరికిం బ్రసన్నుండు గాని పుండరీకాక్షుండు భక్తవత్సలుం డై సురుచిరావయవంబులతో యజనశీలం బయిన యాతని హృదయంబు నందుఁ బాయని రూపంబు గలిగి మనో నయనానందకరావయవంబులు గల తన స్వరూపం బాతనికిఁ జూపం దలంచి.

టీక:- మఱియున్ = ఇంకను; ప్రవర్గ్య = ప్రవర్గ్యము యనెడి {ప్రవర్గ్యము - యాగవిశేషము, సోమయాగమునకు ముందు చేయబడునొక యజ్ఞ క్రతువు, గానమునకు ముందు గాత సంకల్పమునకు సంకేతము)}; సంజ్ఞకంబులు = పేర్లు గలవి; అగు = అయిన; కర్మంబులున్ = క్రతువులను; శ్రద్ధా = శ్రద్ధతోను; విశుద్ధ = పరిశుద్ధమైన; ద్రవ్య = పదార్థములు; దేశ = ప్రదేశములు; కాల = సమయములు; మంత్ర = మంత్ర; ఋత్విక్ = యజ్ఞములు చేయువారు; దక్షిణా = బ్రాహ్మణాదుల కిచ్చెడి ధనాదులు; విధాన = పద్ధతులు; యోగంబులన్ = యోగములచేత; పరమేశ్వరుని = భగవంతుని; మెప్పించినన్ = అనుగ్రహము వచ్చునట్లు చేసిన; ఎవ్వరికిని = ఎవరికిని; ప్రసన్నుండు = ప్రసన్నము; కాని = కానట్టి; పుండరీకాక్షుండు = విష్ణుమూర్తి {పుండరీకాక్షుడు - పుండరీకములు (పద్మముల) వంటి కన్నులు గలవాడు, విష్ణువు}; భక్త = భక్తుల ఎడ; వత్సలుండు = వాత్సల్యము గలవాడు; ఐ = అయ్యి; సు = చక్కటి; రుచిర = కాంతివంతమైన; అవయవంబుల్ = అవయవముల; తోన్ = తోటి; యజన = యజ్ఞములు చేసెడి; శీలంబున్ = స్వభావములు కలిగినది; అయిన = అయినట్టి; ఆతని = అతని యొక్క; హృదయంబున్ = హదయము; అందున్ = లోని; పాయని = విడువని; రూపంబున్ = స్వరూపము; కలిగి = కలిగిన; మనః = మనసునకు; నయనా = కన్నులకు; ఆనంద = సంతోషమును; కర = కలిగించెడి; అవయవంబుల్ = అవయవముల; కల = కలిగిన; తన = తన యొక్క; స్వరూపంబున్ = స్వరూపమును; ఆతని = అతని; కిన్ = కి; చూపన్ = చూపించవలెనని; తలంచి = భావించి.

భావము:- ఇంకా ప్రవర్గ్యా లనబడే యజ్ఞకార్యాలను శ్రద్ధతో, పరిశుద్ధ ద్రవ్యాలతో, ఉచిత ప్రదేశంలో, కాలానుగుణంగా, విధివిహితంగా మంత్రవేత్తలైన ఋత్విక్కులతో, భూరి దక్షిణలతో ఆచరించి పరమేశ్వరుని మెప్పించాడు. ఎవరికీ సులభంగా ప్రసన్నుడు కాని విష్ణువు భక్తవాత్సల్యంతో, ప్రకాశవంతమైన అవయవ సౌష్ఠవంతో హృదయంలో తాను సదా నెలకొని ఉన్నప్పటికీ ప్రత్యక్ష రూపంలో కనులకు పండువుగా, మనసుకు నిండుగా తన స్వరూపాన్ని అతనికి చూపాలనుకొని...

5.1-43-సీ.

అంత నావిష్కృత కాంత చతుర్భుజం-
బులును బీతాంబరంబును వెలుంగ
శ్రీవత్సకౌస్తుభ శ్రీరమా చిహ్నంబు-
లురమందురమ్యమై యిరవు పడఁగ
శంఖ చక్ర గదాంబుజాత ఖడ్గాది ది-
వ్యాయుధంబులు చేతులందు మెఱయ
నతులిత నవరత్నహాట కాంకిత నూత్న-
ఘనకిరీటద్యుతు ల్గడలుకొనఁగఁ

5.1-43.1-తే.

గర్ణ కుండల కటిసూత్ర కనకరత్న
హార కేయూర వరనూపురాది భూష
ణముల భూషితుఁడైన శ్రీనాయకుండు
దంపతుల కప్పు డెదురఁ బ్రత్యక్ష మయ్యె.

టీక:- అంతన్ = అంతట; ఆవిష్కృత = ప్రత్యక్షము చేయ బడిన; కాంత = మనోహరమైన; చతుర్భుజంబులునున్ = నాలుగు చేతులును; పీత = పట్టు; అంబరంబున్ = బట్టలును; వెలుంగన్ = ప్రకాశించుచుతుండగా; శ్రీవత్స = శ్రీవత్సము {శ్రీవత్సము - విష్ణుమూర్తి వక్షస్థలముపైనుండెడి పుట్టుమచ్చ}; కౌస్తుభ = కౌస్తుభ

మణి; శ్రీరమా = లక్ష్మీదేవి యనెడి; చిహ్నంబులు = గుర్తులు; ఉరము = వక్షము; అందున్ = పైన; రమ్యము = మనోహరముగానున్నవి; ఐ = అయ్యి; ఇరవుపడగ = నివాసము యేర్పరుచుకొనగ; శంఖ = శంఖము; చక్ర = చక్రము; గద = గద; అంబుజాత = పద్మము; ఖడ్గ = ఖడ్గము; ఆది = మొదలగు; దివ్య = గొప్ప; ఆయుధంబులున్ = ఆయుధ ములు; చేతులు = చేతుల; అందున్ = లో; మెఱయన్ = ప్రకాశించుతుండగా; అతులిత = సాటిలేని; నవరత్న = నవరత్నములు; హాటక = బంగారమున; అంకిత = పొదిగిన; నూత్న = కొత్త; ఘన = గొప్ప; కిరీట = కిరీటము యొక్క; ద్యుతుల్ = కాంతులు; కడలు = దిక్కులందు; కొనగన్ = వ్యాపించగా; కర్ణకుండల = చెవులకుండలములు.

కటిసూత్ర = మొలనూలు; కనకరత్నహార = బంగారురత్న హారములు; కేయూర = భుజకీర్తులు; వర = శ్రేష్ఠమైన; నూపుర = కాలియందియలు; ఆది = మొదలగు; భూషణములన్ = అలంకారములతో; భూషితుడున్ = అలంకరింపబడినవాడు; ఐన = అయిన; శ్రీనాయకుండు = విష్ణుమూర్తి {శ్రీనాయకుండు - శ్రీ (లక్ష్మీదేవికి) నాయకుండు (ప్రభువు), విష్ణువు}; దంపతుల్ = భార్యాభర్తల; కిన్ = కి; అప్పుడు = అప్పుడు; ఎదురన్ = ఎదురుగా; ప్రత్యక్షమున్ = ప్రత్యక్షము; అయ్యెన్ = అయ్యెను.

భావము:- అప్పుడు ప్రకాశమానాలైన చతుర్భుజాలతో; పట్టు పీతాంబరంతో రమణీయాలైన శ్రీవత్సం, కౌస్తుభమణి, శ్రీదేవి విరాజిల్లే వక్షఃస్థలంతో; శంఖం, చక్రం, గద, పద్మం, ఖడ్గం మొదలైన దివ్యాయుధాలతో; సాటిలేని నవరత్నాల కాంతు లను వెదజల్లే బంగారు కిరీటంతో; మకర కుండలాలు, మొలనూలు, మణులు చెక్కిన స్వర్ణహారాలు, బాహుపురులు, కాలి అందెలు ప్రకాశిస్తుండగా లక్ష్మీపతి ఆ దంపతుల ముందు ప్రత్యక్షమైనాడు.

5.1-44-తే.

ఇట్లు ప్రత్యక్షమగు పరమేశ్వరునకుఁ

బెన్నిధానంబుఁ గనుఁగొన్న పేద మాడ్కి

హర్షమున ఋత్విగాదికు లవనతాస్యు

లగుచు నభినుతి చేసి రిట్లనుచు నపుడు.

టీక:- ఇట్లు = ఈ విధముగ; ప్రత్యక్షమున్ = ప్రత్యక్షము; అగు = అయిన; పరమేశ్వరున్ = పరమేశ్వరుని; కున్ = కు; పెన్నిధానంబున్ = పెద్దనిధిని; కనుగొన్న = కనుక్కొన్న; పేద = పేదవాని; మాడ్కిన్ = వలె; హర్షమునన్ = సంతోషముతో; ఋత్విక్ = యజ్ఞము నడిపించువారు; ఆదికులు = మొదలగువారు; అవనత = వంచిన; ఆస్యులు = మోములు గలవారు; అగుచున్ = అగుచూ; అభినుతిచేసిరి = స్తుతించిరి; ఇట్లు = ఈ విధముగ; అనుచున్ = అనుచూ; అపుడున్ = అప్పుడు;

భావము:- ఈ విధంగా ప్రత్యక్షమైన భగవంతుణ్ణి ఋత్విక్కులు చూసి పెన్నిధిని దర్శించిన పేదలవలె సంతోషంతో తలలు వంచి ఇలా స్తోత్రం చేశారు.

5.1-45-క.

"పరిపూర్ణుఁడ వై యుండియ

మఱువక మా పూజ లెల్ల మన్నింతువు; నీ

చరణార వింద సేవయు

ధరఁ బెద్దలు వినిచి నటుల దగఁ జేసెదమౌ.

టీక:- పరిపూర్ణుడవు = పరిపూర్ణుడవు; ఐ = అయ్యి; ఉండియున్ = ఉండికూడ; మఱువక = మరచిపోకుండగ; మా = మా యొక్క; పూజలు = సేవలు; ఎల్లన్ = అన్నిటిని; మన్నింతువు = మన్నించెదవు; నీ = నీ యొక్క; చరణ = పాదములు

అనెడి; అరవింద = పద్మముల; సేవయున్ = సేవించుటలు; ధరన్ = భూమిపై; పెద్దలు = పెద్దలు; వినిచినటులన్ = చెప్పిన విధముగ; తగన్ = అవశ్యము; చేసెదము = చేయుదుము; ఔ = ఔను చేసెదము.

భావము:- "నీవు పరిపూర్ణుడవై కూడా మమ్మల్ని మరచిపోకుండా మా పూజలను స్వీకరిస్తావు. పెద్దలు మాకు చెప్పిన విధంగా నీ పాదపద్మాలను సేవిస్తాము.

5.1-46-క.

ఏ మిపుడు చేయు సంస్తుతి
నీ మహిమ నెఱింగి కాదు; నిరతముఁ బెద్దల్
దా మెది యుపదేశించిరొ
యా మతమునఁ బ్రస్తుతింతు మయ్య! మహాత్మా!

టీక:- ఏము = మేము; ఇపుడున్ = ఇప్పుడు; చేయు = చేసెడి; సంస్తుతి = స్తోత్రము; నీ = నీ యొక్క; మహిమన్ = మహత్యమును; ఎఱింగి = తెలిసి; కాదు = కాదు; నిరతమున్ = ఎల్లప్పుడును; పెద్దల్ = పెద్దవారు; తాము = వారు; ఎది = ఏదైతే; ఉపదేశించిరో = నేర్చుకొనునట్లు చెప్పిరో; ఆ = ఆ; మతమునన్ = విధముగా; ప్రస్తుతింతుము = స్తుతింతుము; అయ్య = తండ్రి; మహాత్మా = గొప్పవాడ.

భావము:- మహాత్మా! మే మిప్పుడు నీ మహిమలు తెలిసి సంస్తుతి చేయడం లేదు. పెద్దలు మాకు ఏ విధంగా ఉపదేశించారో ఆ విధంగా ప్రస్తుతి చేస్తున్నాము.

5.1-47-వ.

మఱియు నీవు సంసారాసక్తమతి గలిగిన వారికి వశ్యుండవు గావు; యీశ్వరుండవును బ్రకృతి పురుష వ్యతిరిక్తుండవును బరమ పురుషుండవును నయిన నిన్నుఁ బొందని ప్రపం

చాంతర్గతంబు లయిన నామరూపంబులు గల యస్మ దాదులచేత నిరూపింప నశక్యంబగు; సర్వజీవులం జెందిన దురిత సంఘంబుల నిరసించు స్వభావంబు గల నీ యుత్తమ గుణంబులందు నేకదేశంబ గాని సర్వగుణనిరూపణంబు చేయ శక్యంబుగానేరదు; నీ భక్తులు మిక్కిలి భక్తింజేసి సంస్తుతించు గద్గదాక్షరంబులను సలిల శుద్ధ పల్లవ తులసీ దళ దుర్వాంకురంబులను సంపాదించిన పూజను సంతసి ల్లెడి నీకు బహువిధ ద్రవ్య సంపాదనంబు గలిగి విభవ యుక్తంబు లయిన యశ్వమేధాదులును దృప్తికరంబులు గానేరవు స్వభావంబున సర్వకాలంబులందును సాక్షాత్కరించి యతిశయంబై వర్తించుచు నశేషపురుషార్థ స్వరూపంబుఁ బరమానంద రూపంబు నైనవాఁడ వగుటం జేసి యజ్ఞాదుల యందు నీకుఁ దృప్తి లేక యున్న నస్మదాదుల కోరికల కుపచరించు కతంబున యజ్ఞాదుల నొనరింతు; మని మఱియు నిట్లనిరి.

టీక:- మఱియున్ = ఇంకను; నీవున్ = నీవు; సంసార = సంసారమునందు; ఆసక్త = ఆసక్తిగల; మతిన్ = బుద్ధి; కలిగిన = కలిగిన; వారి = వారి; కిన్ = కి; వశ్యుండవు = వశమగువాడవు; కావు = కావు; ఈశ్వరుండవును = ప్రభువునవు; ప్రకృతి పురుష వ్యతిరిక్తుండవును = ప్రకృతి పురుషలకు అతీతమైనవాడవు; పరమపురుషుండవును = అత్యుత్తమ పురుషుడవును; అయిన = అయినట్టి; నిన్నున్ = నిన్ను; పొందని =

పొందని; ప్రపంచ = ప్రపంచము యొక్క; అంతర్గతంబులు = లోపల ఉండునవి; అయిన = అయినట్టి; నామ = పేర్లు; రూపంబులున్ = స్వరూపములు; కల = కలిగినట్టి; అస్మదాదుల్ = నావంటివారి; చేతన్ = వలన; నిరూపింపన్ = నిరూపించుటకు; అశక్యంబు = అసాధ్యము; అగు = అగును; సర్వ = సకల; జీవులన్ = ప్రాణులను; చెందిన = చెందినట్టి; దురిత = పాపముల యొక్క; సంఘంబులన్ = సమూహములను; నిరసించు = తిరస్కరించెడి; స్వభావంబున్ = స్వభావము; కల = కలిగిన; నీ = నీ యొక్క; ఉత్తమ = ఉత్తమమైన; గుణంబుల్ = గుణములు; అందున్ = లలో; ఏకదేశంబ = అనన్యముగ, ఒక భాగము లేక అంశము మాత్రమె; కాని = కాని; సర్వ = సకల; గుణ = గుణములను; నిరూపణంబున్ = నిరూపించుటకు; చేయన్ = చేయుటకు; శక్యంబున్ = సాధ్యము; కాదు = కాదు; నీ = నీ యొక్క; భక్తులు = భక్తులు; మిక్కిలి = అధికమైన; భక్తిన్ = భక్తి; చేసి = వలన; సంస్తుతించు = స్తుతించెడి; గద్గద = బొంగురుపోతున్న గొంతుతో పలికెడి; అక్షరంబులను = పలుకులను; సలిల = నీరు; శుద్ధ = స్వచ్ఛమైన; పల్లవ = చిగుర్లు; తులసీదళ = తులసీ దళములు; దూర్వాంకురంబులును = గరిక మొలకలు; సంపాదించిన = సమీకరించికొని చెసిన; పూజనున్ = పూజలతో; సంతసిల్లెడి = సంతోషించెడి; నీకున్ = నీకు; బహు = అనేక; విధ = రకముల; ద్రవ్య = పదార్థములను; సంపాదనంబున్ = సమీకరించుకొనుట; కలిగి = కలిగి; విభవ = వైభవముతో; యుక్తంబులు = కూడుకొన్నవి; అయిన = అయినట్టి; అశ్వమేధ = అశ్వమేధము; ఆదులన్ = మొదలగువానిచే; తృప్తి = తృప్తిని; కరంబులునున్ = కలిగించునవి; కానేరవు = కాలేవు; స్వభావమునన్ = స్వభావము నందు; సర్వ = సకల; కాలంబుల్ = కాలముల; అందునున్ = లోను; సాక్షాత్కరించి = సాక్షాత్కరించి; అతిశయంబు = అతిశయించినది; ఐ = అయ్యి; వర్తించుచున్ = వర్తించెడి; అశేష = సమస్తమైన; పురుషార్థంబున్ = ధర్మార్థ కామ మోక్ష ప్రయోజనముల; స్వరూపంబున్ = స్వరూపమును; పరమ = అత్యధికమైన; ఆనంద = ఆనందము యొక్క; రూపంబున్ = స్వరూపమును; ఐన = అయినట్టి; వాడవు = వాడవు; అగుటన్ = అగుట; చేసి = వలన; యజ్ఞ = యజ్ఞములు; ఆదులన్ = మొదలగువాని; అందున్ = అందు; నీకున్

= నీకు; తృప్తి = తనివినొందుట; లేక = లేకుండగ; ఉన్నన్ = ఉండికూడ; అస్మదాదులన్ = నాలాంటివారి; కోరికల్ = కోరికల; కున్ = కు; ఉపచరించు = సమ్మతించు, ఉపకరించు; కతంబునన్ = కారణముచేత; యజ్ఞ = యజ్ఞములు; ఆదులన్ = మొదలగువానిని; ఒనరింతుము = ఆచరింతుము; అని = అని; మఱియున్ = ఇంకను; ఇట్లు = ఈ విధముగ; అనిరి = పలికిరి.

భావము:- ఇంకా సంసారంలో మునిగి తేలే వారికి నీవు పట్టుబడవు. నీవు ఈశ్వరుడవు. ప్రకృతి కంటే జీవుని కంటే భిన్నమయినవాడవు. పరమ పురుషుడవు. మేము పంచభూతాల సృష్టికి లోనైన నామరూపాలను ధరించిన వాళ్ళం. అటువంటి మాకు నీ తత్త్వాన్ని నిరూపించడం సాధ్యం కాదు. సకల జీవరాసుల పాపసమూహాలను తొలగించడం నీ స్వభావం. అటువంటి నీ ఉత్తమ గుణాలలో ఏదో ఒక అంశమే కాని సమస్త గుణాలను నిరూపించడం ఎవరికీ ఏమాత్రం సాధ్యం కాదు. నీ భక్తులు భక్తితో గద్గద స్వరంతో సంస్తుతిస్తూ, నీ కర్పించే నిర్మల జలం, చిగురుటాకులు, తులసీదళాలు, దూర్వాంకురాలు మొదలైన వాటితో నీవు సంతృప్తి పడతావు. అంతేకాని నానావిధ ద్రవ్యాలు సంతరించికొని మహా వైభవంతో చేసే అశ్వమేధాది యాగాలు కూడా నీకు సంతృప్తిని కలిగించవు. స్వాభావికంగానే నీవు సర్వకాలాలలోను సాక్షాత్కరిస్తావు. నీవు సర్వాతిశాయివి. సమస్త పురుషార్థాలు నీవే. పరమానంద స్వరూపుడవైన నీకు యజ్ఞయాగాదుల వల్ల తృప్తి లేకున్నా మా కోరికలను తీర్చుకోవడానికి మేము యజ్ఞాలను చేస్తున్నాము" అని ఇంకా ఇలా అన్నారు.

5.1-48-క.

"బాలిశుల మగుచు మిక్కిలి

మే లెఱుగని మమ్ము నీదు మించిన దయచేఁ

బాలింతు విత్తు వెప్పుడుఁ

జాలఁగ నిహపరములందు సకల సుఖములున్.

టీక:- బాలిశులము = మూర్ఖులము; అగుచున్ = అగుచూ; మిక్కిలి = అధికమైన; మేలు = మంచి; ఎఱుగని = తెలియని; మమ్మున్ = మమ్ములను; నీదు = నీ యొక్క; మించిన = అతిశయించిన; దయ = కృప; చేన్ = తోటి; పాలింతువు = పరిపాలించెదవు; ఇత్తువు = ఇచ్చెదవు; ఎపుడున్ = ఎల్లప్పుడును; చాలగన్ = అదికముగా; ఇహ = ఇహలోకము; పరములు = పరలోకమున; అందున్ = లోను; సకల = సమస్తమైన; సుఖములన్ = సౌఖ్యములను.

భావము:- మూర్ఖులమైన మాకు ఏది మంచిదో ఏది కాదో మాకే తెలియదు. అయినా ఎంతో దయతో మమ్మల్ని కాపాడి ఇహపరాలకు తగిన సకల సుఖాలను నీవు మాకు ప్రసాదిస్తున్నావు.

5.1-49-ఆ.

ఇపుడు మేము నీకు నిష్టంబు లగు పూజ

లాచరింపకున్న నైన నధిక

మయిన నీ కృపాకటాక్ష వీక్షణములఁ

జక్కఁ జూచి తగఁ బ్రసన్నుఁ డగుచు.

టీక:- ఇపుడున్ = ఇప్పుడు; మేమున్ = మేము; నీకున్ = నీకు; ఇష్టంబులు = ప్రీతికరములు; అగు = అయిన; పూజలున్ = పూజలను; ఆచరింపకున్నన్ = ఆచరింపకపోయి; ఐననున్ = అయినను; అధికమయిన = మిక్కిలి; నీ = నీ యొక్క; కృపా = దయతోకూడిన; కటాక్ష = కడగంటి; వీక్షణములన్ = చూపులతో; చక్కన్ = చక్కగా; చూచి = చూసి; తగన్ = అవశ్యము; ప్రసన్నుడు = ప్రసన్నమైనవాడు; అగుచున్ = అగుచూ.

భావము:- ఇప్పుడు మేము నీకు సంతృప్తి కలిగేటట్లు ఇష్టమైన పూజలు చేయక పోయినా మా మీద కరుణాకటాక్ష వీక్షణాలను ప్రసరింప జేసి ప్రసన్నుడవైనావు.

## 5.1-50-క.

వర మీయఁ దలఁచి మమ్ముం

గరుణించితి గాక; నిన్నుఁ గనుగొనుటకునై

యరసి నుతింపఁగ మాకుం

దర మగునే? వరద! నీరదశ్యామాంగా!

టీక:- వరమున్ = వరములను; ఈయన్ = ఇవ్వవలెనని; తలచి = భావించి; మమ్మున్ = మమ్ములను; కరుణించితి = దయచూపితివి; కాక = అంతేకాని; నిన్నున్ = నిన్ను; కనుగొనుట = తెలిసికొనుట; కున్ = కోసము; ఐ = అయ్యి; అరసి = తరచిచూసుకొని; నుతింపగన్ = స్తుతించుటకు; మాకున్ = మాకు; తరమున్ = సాధ్యము; అగునే = అగునా ఏమి; వరద = నారాయణ {వరద - వరములను ద (ఇచ్చువాడు), విష్ణువు}; నీరదశ్యామాంగా = నారాయణ {నీరద శ్యామాంగ - నీరదము (మేఘము) వంటి శ్యామాంగ (నల్లని దేహము గలవాడు), విష్ణువు}.

భావము:- కోరిన కోరికలను అనుగ్రహించేవాడా! నీలమేఘం వంటి శరీరచ్ఛాయ కలవాడా! వరమివ్వడానికి నీవు మా ముందు సాక్షాత్కరించావు. నిన్ను సందర్శించడానికి కాని సంస్తుతించడానికి కాని మాకు సాధ్యమౌతుందా?

5.1-51-వ.

మఱియు, నిస్సంగులై నిశితజ్ఞానంబునంజేసి దోషరహితులై భగవత్స్వభావులు నాత్మారాములు నగు మునులకు స్తుతి యింపఁ దగిన గుణంబులు గలవాడ వగుచుండియుఁ బ్రస న్నుండవు; స్ఖలన క్షుత పతన జృంభణాది దురవస్థ లందును జరామరణాది దుర్దశలందును వివశుల మగు మాకుఁ గల్మష నాశకరంబులయిన భవద్దివ్యనామంబులు మా వచనగోచరం బులగుం గాక; మఱియు నీ రాజర్షి పుత్రకాముం డై నీ తోడ సమానుండయిన కుమారునిం గోరి కామంబుల స్వర్గాప వర్గంబుల నీనోపిన నినుం బూజించి ధనకాముం డైనవాఁడు ధనవంతునిం జేరి తుషమాత్రం బడిగిన చందం బున మోక్షనాథుండ వైన నీవలన సంతానంబు గోరుచున్న వాఁడు; జయింపరాని నీ మాయ చేత నెవ్వండు మోహంబు నొంది విషయాసక్తుండు గాక యుండు? నర్థకాములము మదాంధు లము నగు మేము నిన్ను నాహ్వానంబు చేసిన యపరాధంబు సర్వాత్మకుండ వగుటం జేసి సామ్యంబుచే మన్నింప దగుదువు; మమ్ము దయఁ జూడు"మని ప్రణమిల్లిన సర్వేశ్వ రుండు వర్షాధిపతి యగు నాభిచేతను, ఋత్విక్కుల చేతను, వంద్యమానుండై దయాకలితుం డగుచు యిట్లనియె.

టీక:- మఱియున్ = ఇంకను; నిస్సంగులు = విరాగులు {నిస్సంగులు – సాంగత్యముసు అన్నింటిని విసర్జించినవారు, విరాగులు}; నిశిత = వాడియైన; జ్ఞానంబునన్ = జ్ఞానము; చేసి = వలన; దోష = పాపములు; రహితులు = లేనివారు; ఐ = అయ్యి; భగవత్ = భగవంతుని వంటి; స్వభావులు = స్వభావములు గలవారు; ఆత్మారాములు = ఆనందము ఆత్మగా కలవారు; అగు = అయిన; మునులు = మునుల; కున్ = కు; స్తుతియింపన్ = స్తుతించుటకు; తగిన = తగినట్టి; గుణంబులున్ = సుగుణములు; కలవాడవు = కలిగినవాడవు; అగుచుండియు = అయినప్పటికిని; ప్రసన్నుండవు = ప్రసన్నమైనవాడవు; స్ఖలన = జారుట; క్షుత = తుమ్ముట; పతన = పడుట; జృంభణ = ఆవులింతలు; ఆది = మొదలగు; దురవస్థలు = చెడుస్థితుల; అందునున్ = లోను; జర = ముసలితనము; మరణ = మరణము; ఆది = మొదలగు; దుర్దశల్ = చెడు సమయములు; అందున్ = లోను; వివశులము = స్వాధీనము తప్పెడి వారము; అగు = అయిన; మాకున్ = మాకు; కల్మష = పాపములను; నాశ = నాశనము; కరంబులు = చేసెడివి; అయిన = అయినట్టి; భవత్ = నీ యొక్క; దివ్య = దివ్యమైన; నామంబులు = నామములు; మా = మా యొక్క; వచన = మాటలకు; గోచరంబులున్ = అందునవి; అగుగాక = అగుగాక; మఱియున్ = ఇంకను; ఈ = ఈ; రాజర్షి = రాజులలో ఋషివంటివాడు; పుత్ర = కొడుకులను; కాముండు = కోరెడివాడు; ఐ = అయ్యి; నీ = నీ; తోడన్ = తోటి; సమానుండు = సమానమైనవాడు; అయిన = అయినట్టి; కుమారునిన్ = పుత్రుని; కోరి = కోరుతూ; కామంబులన్ = కోరికలను; స్వర్గ = స్వర్గము; అపవర్గంబుల్ = ముక్తులను; ఈన్ = ఇచ్చుటకు; ఓపిన = సమర్థత కలిగిన; నినున్ = నిన్ను; పూజించి = సేవించి; ధన = సంపదలను; కాముండు = కోరెడివాడు; ఐన = అయిన; వాడు = వాడు; ధనవంతునిన్ = భాగ్యశాలిని; చేరి = సమీపించి; తుష = వట్టి ఊకను; మాత్రంబున్ = మాత్రమే; అడిగిన = కోరిన; చందంబునన్ = వలె; మోక్ష = ముక్తికి; నాథుండవు = ప్రభువు; ఐన = అయిన; నీ = నీ; వలనన్ = వలన; సంతానంబున్ = సంతానమును; కోరుచున్నవాడు = కోరెడివాడు; జయింపరాని = జయించుటకు సాధ్యముగాని; నీ = నీ యొక్క; మాయన్ = మాయ; చేతన్ = వలన; ఎవ్వండున్ =

ఎవడైతే; మోహంబున్ = మోహమును; ఒంది = పొంది; విషయ = విషయములు యందు; ఆసక్తుండు = ఆసక్తిగలవాడు; కాక = కాకుండగా; ఉండు = ఉండెడి; అర్థ = సంపదలను; కాములము = కోరెడివారము; మద = గర్వముతో; అంధులము = గుడ్డివారము; అగు = అయిన; మేమున్ = మేము; నిన్నున్ = నిన్ను; ఆహ్వానంబు = ఆహ్వానించుట; చేసిన = చేసినట్టి; అపరాధంబున్ = తప్పులను; సర్వ = నిఖిలమైన జీవుల; ఆత్మకుండు = ఆత్మలయందు ఉండెడివాడు; అగుటన్ = అగుట; చేసి = వలన; సామ్యంబున్ = సమదృష్టి; చేన్ = తోటి; మన్నింపన్ = మన్నించుటకు; తగుదువు = తగినవాడవు; మమ్మున్ = మమ్ములను; దయన్ = కృపతో; చూడుము = చూడుము; అని = అని; ప్రణమిల్లిన = నమస్కరించిన; సర్వేశ్వరుండు = నారాయణుడు {సర్వేశ్వరుడు - అఖిలమైనవారికిని ఈశ్వరుడు, విష్ణువు}; వర్ష = వర్షములకు; అధిపతి = అధికారి; అగు = అయిన; నాభి = నాభి; చేతను = చేతను; ఋత్విక్కుల్ = యజ్ఞము నడపెడివారి; చేతను = చేతను; వంద్యమానుండు = వందనముచేయబడినవాడు; ఐ = అయ్యి; దయా = కృప; కలితుండు = కలిగినవాడు; అగుచున్ = అగుచూ; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇంకా మునులు కోరికలు లేనివారు. సునిశ్చితమైన జ్ఞానం కలవారు. దోషాలు లేనివారు. భగవంతుని ప్రతిరూపాలు. ఆత్మారాములు. అలాంటి మునులకు స్తోత్రార్హుడ వైనప్పటికీ అందరిపట్ల అనుగ్రహం చూపుతున్నావు. కాలు జారినప్పుడు, క్రింద పడ్డప్పుడు, తుమ్మినప్పుడు, ఆవులించినప్పుడు, జ్వరంతో పీడింప బడుతున్నపుడు, చావుకు చేరువ అయినప్పుడు, మా మీద మాకే అధికారం తప్పినప్పుడు మా పాపాలను పోగొట్టే నీ దివ్యనామాలు మా నోటివెంట వెడలే విధంగా అనుగ్రహించు. ఈ రాజర్షి అయిన నాభి నీకు సమానమైన సంతానం కావాలని నిన్ను పూజించాడు. కోరిన కోరికలను, స్వర్గాన్ని, మోక్షాన్ని సైతం ఇవ్వగల నిన్ను ఇలా అడగడం ధనం కోసం ధనవంతుని దగ్గరకు వెళ్ళి ఊక అడిగినట్టుంది. మోక్ష ప్రదాతవైన నిన్ను సంతానం కోసం ప్రార్థిస్తున్నాడు. మీ మాయ దాటరానిది. అలాంటి మాయకు లోబడి ఇంద్రియ కాంక్షలకు లోనుకాని వా డెవడు? ప్రతి పనిని ప్రయోజనం దృష్టిలో పెట్టుకొని చేసేవాళ్ళం మేము. గర్వాంధులము. అయినా నిన్ను ఆహ్వానించిన

మా అపరాధాన్ని మన్నించు. మమ్ము అనుగ్రహించు” అని నమస్కరించారు. అప్పుడు సర్వేశ్వరుడు జంబూద్వీపంలోని ఒక వర్షానికి అధిపతి అయిన నాభి ఋత్విక్కులతో కలిసి చేసిన వందనాలు అందుకొంటూ దయతో ఇలా అన్నాడు.

5.1-52-క.

"మునులార! వేదవాక్యము

లను బ్రస్తుతి చేసి సర్వలక్షణముల నా

కెన యగు పుత్రుని నిమ్మని

వినఁ బలికితి రిపుడు మిగుల వేడుకతోడన్

టీక:- మునులార = ఓ మునులు; వేద = వేదము లందలి; వాక్యములను = పలుకులతో; ప్రస్తుతి = స్తోత్రము; చేసి = చేసి; సర్వ = సకలమైన; లక్షణములన్ = లక్షణములలోను; నా = నా; కున్ = కు; ఎనయు = సాటి; అగు = అయిన; పుత్రునిన్ = కుమారుని; ఇమ్ము = ఇవ్వవలసినది; అని = అని; వినబలికితిరి = అడిగితిరి; ఇపుడున్ = ఇప్పుడు; మిగులన్ = మిక్కిలి; వేడుక = సంతోషము; తోడన్ = తోటి.

భావము:- “మునులారా! నన్ను వేదమంత్రాలతో ప్రస్తుతి చేసి సకల లక్షణాలలో నాకు సాటి అయిన కొడుకును నాభికి ప్రసాదించవలసిందిగా ఎంతో కుతూహలంతో నన్ను కోరారు.

5.1-53-క.

నాకాది లోకములలో

నాకున్ సరివచ్చు నట్టి నందను నెటు నా

లోకింప లేరు; గావున

నాకున్ సరి నేన కా మనమున నెఱుఁగుఁడీ.

టీక:- నాక = స్వర్గము; ఆది = మొదలగు; లోకములలోన్ = లోకము లయందు; నాకున్ = నాకు; సరివచ్చునట్టి = సాటి ఐనట్టి; నందనున్ = పుత్రుని; ఎటున్ = ఏ విధముగను; ఆలోకింపలేరు = చూడలేరు; కావునన్ = కనుక; నాకున్ = నాకు; సరి = సాటి; నేన = నేను మాత్రమే; కాన్ = అయినట్లు; మనమునన్ = మనసులలో; ఎఱుగుడీ = తెలిసికొనండి.

భావము:- స్వర్గాది లోకాలలో నాకు సాటి రాదగ్గ కుమారుడు ఎక్కడా కనిపించడు. నాకు సాటి నేనే అని మీరు తెలుసుకొనండి.

## 5.1-54-వ.

అదియునుం గాక భూసురోత్తములు నా ముఖంబగుటం జేసి విప్రవాక్యంబు దప్పింపరాదు; మీరు నా యీడు కుమారు నడిగితిరి గావున నాభిపత్ని యగు మేరుదేవి యందు నేన పుత్రుండనై జనియించెద"నని పలికి పరమేశ్వరుం డాగ్నీధ్రీయపత్ని యగు మేరుదేవి చూచుచుండ నా యజ్ఞం బున నంతర్ధానంబు నొంది యా నాభిమీఁది దయం జేసి దిగంబరులును దపస్వులును జ్ఞానులును నూర్ధ్వరేతస్కు లును నగునైష్ఠికులకు యోగ ధర్మంబుల నెఱింగింపం దలంచి పుండరీకాక్షుండు నాభిపత్ని యగు మేరుదేవి గర్భాగారంబునం బ్రవేశించె; నంత.

టీక:- అదియునున్ = అంతే; కాక = కాకుండగ; భూసుర = బ్రాహ్మణులలో {భూసురులు - భూమిపైన సురులు (దేవతలు), బ్రాహ్మణులు}; ఉత్తములు = ఉత్తములు; నా = నా యొక్క; ముఖంబున్ = ముఖము; అగుటన్ = అగుట; చేసి = వలన; విప్ర = బ్రాహ్మణుల; వాక్యంబున్ = వాక్కు; తప్పింపన్ = తప్పించుటకు; రాదు = వీలుకాదు; మీరు = మీరు; నా = నా యొక్క; ఈడు = సాటి అగు; కుమారున్ =

పుత్రుని; అడిగితిరి = అడిగినారు; కావునన్ = కనుక; నాభి = నాభి యొక్క; పత్ని = భార్య; అగు = అయిన; మేరుదేవి = మేరుదేవి; అందున్ = అందు; నేన = నేనే; పుత్రుడను = కుమారుడను; ఐ = అయ్యి; జనియించెదన్ = పుట్టెదను; అని = అని; పలికి = పలికి; పరమేశ్వరుండు = నారాయణుడు {పరమేశ్వరుడు - పరమమైనట్టి ఈశ్వరుడు, విష్ణువు}; ఆగ్నీధ్రీయ = ఆగ్నీధ్రుని పుత్రుని; పత్ని = భార్య; అగు = అయిన; మేరుదేవి = మేరుదేవి; చూచుచుండన్ = చూస్తుండగా; ఆ = ఆ; యజ్ఞంబునన్ = యజ్ఞము నందు; అంతర్ధానంబున్ = మాయ మగుటను; ఒంది = పొంది; ఆ = ఆ; నాభి = నాభి; మీది = పైనున్న; దయన్ = దయ; చేసి = వలన; దిగంబరులునున్ = అవధూతలు {దిగంబరులు - దిక్కులే అంబరము (బట్టలు)గా గలవారు, బట్టలుకట్టనివారు, అవధూతలు}; తపస్వులును = మునులు; జ్ఞానులును = మిక్కిలి జ్ఞానముగలవారు; ఊర్ధ్వరేతస్కులును = బ్రహ్మచారులు {ఊర్ధ్వరేతస్కులు - పైకి మరలించబడిన ఇంద్రియములు కలవారు, బ్రహ్మచారులు}; అగు = అయిన; నైష్ఠికుల్ = నిష్ఠ గలవారల; కున్ = కు; యోగ = యోగము యొక్క; ధర్మంబులన్ = లక్షణములను; ఎఱిగింపన్ = తెలుప; తలంచి = భావించి; పుండరీకాక్షుండు = హరి; నాభి = నాభి యొక్క; పత్ని = భార్య; అగు = అయిన; మేరుదేవి = మేరుదేవి; గర్భాగారంబునన్ = గర్భాశయములో; ప్రవేశించెన్ = ప్రవేశించెను; అంతన్ = అంతట.

భావము:- అంతేకాక బ్రాహ్మణులు నాకు ముఖం వంటివారు కనుక వారి మాట దాటడానికి వీలుకానిది. మీరు నాకు సమానుడైన కుమారుణ్ణి కోరారు. అందుచేత ఈ నాభి మహారాజు భార్య అయిన మేరుదేవికి నేనే కొడుకునై జన్మిస్తాను" అని నాభి, మేరుదేవి చూస్తుండగా యజ్ఞంలో అంతర్ధాన మయ్యాడు. ఆ తర్వాత దిగంబరులు, తాపసులు, జ్ఞానులు, ఊర్ధ్వరేతస్కులు అయిన నైష్ఠికులకు యోగధర్మాలు బోధించడానికి నాభి మీద దయతో విష్ణువు మేరుదేవి గర్భంలో ప్రవేశించాడు. అప్పుడు...

5.1-55-ఆ.

మేరుదేవియందు మేరుధీరుం డగు
హరి సమస్త లక్షణాన్వితుండు
శమదమాదిగుణ విశారదుం డుదయించె
సకలజనుల కపుడు సంతసముగ.

టీక:- మేరుదేవి = మేరుదేవి; అందున్ = అందు; మేరు = మేరునగము అంతటి; ధీరుండు = ధీరత్వము గలవాడు; అగు = అయిన; హరి = విష్ణువు; సమస్త = సమస్తమైన; లక్షణ = లక్షణములను; ఆన్వితుండు = కూడినవాడు; శమదమాది = శమదమాది; గుణ = సుగుణములతో; విశారదుండు = నేర్పరి ఐనవాడు; ఉదయించెన్ = పుట్టెను; సకల = అఖిలమైన; జనులు = వారల; కిన్ = కి; అపుడున్ = అప్పుడు; సంతసముగ = సంతోషము కలుగ.

భావము:- సమస్త శుభలక్షణాలు కలవాడు, శమదమాది గుణ సంపన్నుడు, మేరుధీరుడు అయిన శ్రీహరి మేరుదేవికి కుమారుడుగా అవతరించాడు. సమస్త జనులు సంతోషించారు.

5.1-56-ఆ.

ధవళ కాంతియుక్తిఁ దనరు దేహంబును
మహిత బలపరాక్రమంబు వీర్య
మును దలంచి చూచి జనకుండు పేరిడె
సుతుని ఋషభుఁ డనుచు సొంపుతోడ.

టీక:- ధవళ = తెల్లని; కాంతి = ప్రకాశముతో; యుక్తిన్ = కూడి; తనరు = అతిశయించెడి; దేహంబునున్ = శరీరము; మహిత = గొప్ప; బల = శక్తి; పరాక్రమంబున్ = పరాక్రమములు; వీర్యమున్ = శౌర్యములు; తలంచి =

ఆలోచించి; చూచి = చూసి; జనకుండు = తండ్రి; పేరు = పేరు; ఇడెన్ = పెట్టెను; సుతుని = పుత్రుని; ఋషభుడు = ఋషభుడు; అనుచున్ = అని; సొంపు = చక్కదనము; తోడన్ = తోటి.

భావము:- పుట్టిన శిశువు వెలుగులు వెదజల్లుతూ ఉండడం గమనించి, అతడు బలవంతుడని, పరాక్రమవంతుడని, శౌర్య కలవాడని అర్థం చేసికొని నాభి తన కుమారునికి "ఋషభుడు" అని పేరు పెట్టాడు.

## ఋషభుని రాజ్యాభిషేకము

5.1-57-క.

ధరణీసురులును మంత్రులుఁ

బరివారము హితులుఁ బ్రజలు బాంధవులును సు

స్థిరమతి నా బాలకునిం

గర మనురాగమున రాజుగాఁ జూచి రిలన్.

టీక:- ధరణీసురులును = బ్రాహ్మణులు; మంత్రులున్ = మంత్రులు; పరివారమున్ = సేవకులు; హితులున్ = స్నేహితులు; ప్రజలున్ = ప్రజలు; బాంధవులునున్ = బంధువులు; సుస్థిరమతిన్ = నిశ్చలమైన మనసుతో; ఆ = ఆ; బాలకునిన్ = పిల్లవానిని; కరము = మిక్కిలి; అనురాగమునన్ = ప్రీతితో; రాజుగా = రాజు అగునట్లు; చూచిరి = చూసిరి; ఇలన్ = నేలపైన.

భావము:- బ్రాహ్మణులు, మంత్రులు, పరివారం, హితులు, ప్రజలు, బంధువులు అనురాగాతిశయంతో చిన్నపిల్లవాడు అయిన ఆ ఋషభుని తమ రాజు గానే భావించారు.

5.1-58-క.

పురుహూతుఁ డతని మహిమలు

సరగున విని చిత్తమునకు సహ్యము గామిం

బరికించి ఋషభుఁ డేలెడి

ధరణి ననావృష్టి మిగుల దట్టము చేసెన్.

టీక:- పురుహూతుడు = ఇంద్రుడు; అతని = అతని యొక్క; మహిమలున్ = గొప్పదనము; సరగునన్ = శ్రీఘ్రముగా; విని = విని; చిత్తమున్ = మనసున; కున్ = కు; సహ్యము = సహింప గలది; కామిన్ = కాకపోవుట; పరికించి = గమనించుకొని; ఋషభుడు = ఋషభుడు; ఏలెడి = పరిపాలించెడి; ధరణిన్ = భూమిపైన; అనావృష్టిన్ = వానలు లేకపోవుటను; మిగులన్ = మిక్కిలి; దట్టముగా = గట్టిగా; చేసెన్ = చేసెను.

భావము:- ఇంద్రుడు ఋషభుని మహిమలు విని సహింపలేక అతడు పరిపాలించే రాజ్యంలో వానలు పడకుండా చేసాడు.

5.1-59-ఆ.

అది యెఱింగి ఋషభుఁ డంతట యోగ మా

యా బలంబు కతన నఖిల రాజ్య

మందుఁ గురియఁ జేసె నత్యంత సంపూర్ణ

వృష్టి దినదినంబు వృద్ధిఁ బొంద.

టీక:- అది = దానిని; ఎఱింగి = తెలిసి; ఋషభుడు = ఋషభుడు; అంతటన్ = అంతట; యోగమాయా = యోగమాయ యొక్క; బలంబున్ = బలము; కతన = వలన; అఖిల = సమస్తమైన; రాజ్యము = రాజ్యము; అందున్ = అంతటను;

కురియన్ = కురియునట్లు; చేసెను = చేసెను; అత్యంత = అత్యధికమైన; సంపూర్ణ = నిండు; వృష్టిన్ = వర్షమును; దినదినంబున్ = ప్రతిదినము; వృద్ధి = అధికము; పొందన్ = అగునట్లు.

భావము:- ఇంద్రుని ఆ దౌష్ట్యాన్ని ఋషభుడు గుర్తించి తన యోగమాయతో దినదినాభివృద్ధిగా సర్వ సమృద్ధిగా రాజ్యమంతటా వర్షం కురిపించాడు.

5.1-60-వ.

ఇట్లు ఋషభుండు పురందరుండు చేయు దౌష్ట్యంబునకు నవ్వి యజనాభం బను తన మండలంబు సుభిక్షంబుగాఁ జేసె; నాభియుం దన కోరిన చందంబునం బుత్రుండు జనియించి వర్ధిల్లుటకు సంతసిల్లి తనచేత నంగీకరింపంబడు నరలోక ధర్మంబు గల పుండరీకాక్షుని మాయా విలసితంబునం జేసి "బాలకా! నా తండ్రి!"యని మోహంబున నుపలాలించుచుఁ బ్రజానురాగంబున సర్వసమ్మతుం డయిన పుత్రుని సమయ సేతు రక్షణంబునకుఁ బూజ్యంబయిన రాజ్యంబునం దభిషిక్తుం జేసి భూసురులకుఁ బ్రధానవర్గంబునకు నప్పగించి మేరుదేవిం గూడి నరనారాయణ స్థానం బయిన బదరికాశ్రమంబునకుం జని యచ్చట మహాయోగసమాధిచే నరనారాయణాఖ్యుండుఁ బురుషోత్తముండు నగు వాసుదేవు నారాధించి క్షీణదేహుండై యా నాభి హరి తాదాత్మ్యంబు నొందె; నంత.

టీక:- ఇట్లు = ఈ విధముగ; ఋషభుడు = ఋషభుడు; పురంధరుడు = ఇంద్రుడు; చేయు = చేసెడి; దౌష్ట్యంబున్ = దుష్టత్వమున; కున్ = కు; నవ్వి = హేళనగా నవ్వి; అజనాభంబున్ = అజనాభము {అజనాభము - ఒక రాష్ట్రము పేరు, అజము (మేషము) నాభము (ప్రముఖమైనవి), రాశిచక్రము}; అను = అనెడి; తన = తన యొక్క; మండలము = దేశము; సుభిక్షంబు = సుసంపన్నము {సుభిక్షము - సు (చక్కటి) భిక్షము దొరకునది, సుసంపన్నము}; కాన్ = అగునట్లు; చేసెన్ = చేసెను; నాభియున్ = నాభి కూడ; తన = తను; కోరిన = కోరిన; చందంబునన్ = విధముగా; పుత్రుండు = కుమారుడు; జనియించి = పుట్టి; వర్ధిల్లుట = పెరుగుట; కున్ = కు; సంతసిల్లి = సంతోషించి; తన = తన; చేతన్ = చేత; అంగీకరింపంబడు = సమ్మతింపబడెడి; నరలోక = భూలోకపు; ధర్మంబున్ = ధర్మములు; కల = కలిగిన; పుండరీకాక్షుని = నారాయణుని; మాయా = మాయ యొక్క; విలసితంబునన్ = విలాసము; చేసి = వలన; బాలకా = పిల్లవాడా; నాతండ్రి = నాయనా; అని = అని; మోహంబునన్ = మోహములోపడి; ఉపలాలించుచున్ = బుజ్జగించుచు; ప్రజా = సంతానము ఎడ; అనురాగంబునన్ = అనురాగముతో; సర్వ = అందరకును; సమ్మతుండు = అంగీకారమైనవాడు; అయిన = అయిన; పుత్రుని = కుమారుని; సమయ = ఆచారముల; సేతు = కట్టుబాట్లకు; రక్షణంబున్ = కాపాడుటకు; పూజ్యంబున్ = ఉత్తమమైనది; అయిన = అయినట్టి; రాజ్యంబున్ = రాజ్యము; అందున్ = అందు; అభిషిక్తుంజేసి = పట్టముగట్టి; భూసురుల్ = బ్రాహ్మణుల; కున్ = కు; ప్రధాన = మంత్రి; వర్గంబున్ = సమూహమున; కున్ = కు; అప్పగించి = అప్పజెప్పి; మేరుదేవిన్ = మేరుదేవితో; కూడి = కలసి; నరనారాయణ = నరనారాయణుని; స్థానంబున్ = స్థలము; అయిన = అయిన; బదరికా = బదరిక అనెడి; ఆశ్రమంబున్ = ఆశ్రమమున; కున్ = కు; చని = వెళ్ళి; అచ్చటన్ = అచ్చట; మహా = గొప్ప; నరనారాయణ = నరనారాయణుడు యనెడి; ఆఖ్యుండ = పేరు గలవాడు; పురుషోత్తముండు = విష్ణువు; అగు = అయిన; వాసుదేవునిన్ = విష్ణుమూర్తిని; ఆరాధించి = సేవించి; క్షీణ = చిక్కిపోయిన; దేహుండు = శరీరము

గలవాడు; ఐ = అయ్యి; ఆ = ఆ; నాభి = నాభి; హరి = విష్ణుని; తాదాత్మ్యంబున్ = యందు కలసిపోవుటను; ఒందెన్ = పొందెను; అంతన్ = అంతట.

భావము:- ఈవిధంగా దేవేంద్రుని దుర్బుద్ధికి ఋషభుడు నవ్వుకొని అజనాభం అనే పేరుతో వ్యవహరింపబడే తన భూమండలాన్ని సుభిక్షం చేసాడు. నాభి తాను కోరుకొనినట్లు కొడుకు పుట్టడం, పెరగడం చూచి చాల సంబరపడ్డాడు. విష్ణువు మాయ కారణంగాను, భూలోక ధర్మాల కనుగుణంగాను నాభి తన కుమారుణ్ణి “నా తండ్రీ!” అంటూ వ్యామోహంతో ముద్దాడాడు. ప్రజల అభిమానం చూరగొన్నవాడు, అన్ని వర్గాల వారికి ఆమోదయోగ్యుడు అయిన తన కుమారుడు రాజ్యపాలనకు తగినవాడని భావించి పట్టం కట్టాడు. బ్రాహ్మణులకు, మంత్రి వర్గానికి అతణ్ణి అప్పగించి భార్య మేరుదేవితోకూడి నరనారాయణులకు నిలయమైన బదరికాశ్రమం చేరుకున్నాడు. అక్కడ నరనారాయణ స్వరూపుడు, పురుషోత్తముడు అయిన వాసుదేవుని తదేక ధ్యానంతో ఆరాధించాడు. క్రమంగా శరీరం పట్టుతప్పగా చివరకు సతీసమేతుడైన నాభి శ్రీహరితో తాదాత్మ్యం పొందాడు.

## 5.1-61-చ.

సరసత నే నృపాలకుని జన్మమునందును భూసురోత్తముల్
సరసిజనాభునిం దగఁ బ్రసన్నతఁ బెట్టిన నంత మెచ్చి యీ
శ్వరుఁడు దనంత గర్భమున వచ్చి తనూభవుఁడై జనించె, నా
నరపతి నాభికిన్ సరి యనం దగునే నరనాథ! యన్యులన్.

టీక:- సరసతన్ = చక్కగా; ఏ = ఏ; నృపాలకుని = రాజు యొక్క {నృపాలకుడు - నృ (నరులను) పాలకుడు (పరిపాలించెడివాడు), రాజు}; జన్మము = పుట్టుక; అందును = సమయములో; భూసురుల్ = బ్రాహ్మణులలో; ఉత్తముల్ = ఉత్తములు; సరసిజనాభునిన్ = విష్ణుని {సరసిజనాభుడు - సరసిజము (పద్మము) నాభుడు (నాభిన గలవాడు), విష్ణువు}; తగన్ = అవశ్యము; ప్రసన్నతన్ = అనుగ్రహామున;

పెట్టిన = కలిగించిన; అంతన్ = అంతట; మెచ్చి = మెచ్చుకొని; ఈశ్వరుడున్ = విష్ణువు; తనంత = తనంతతనే; గర్భమునన్ = గర్భములో; వచ్చి = చేరి; తనూభవుడు = పుత్రుడు {తనూభవుడు - శరీరమున పుట్టినవాడు, పుత్రుడు}; ఐ = అయ్యి; జనించెన్ = పుట్టెను; ఆ = ఆ; నరపతి = రాజు {నరపతి - నరులకు ప్రభువు, రాజు}; నాభి = నాభి; కిన్ = కి; సరి = సాటి; అనన్ = అనుటకు; తగునే = తగునా ఏమి; నరనాథ = రాజ {నరనాథుడు - నరులకు ప్రభువు, రాజు}; అన్యులన్ = ఇతరులను.

భావము:- ఏ రాజు యజ్ఞంలో బ్రాహ్మణోత్తములైన ఋత్విక్కులు విష్ణుమూర్తిని ప్రార్థించి ప్రసన్నం చేసుకున్నారో, ఏ రాజు భార్య గర్భంలో నుంచి ఈశ్వరుడు తనంత తానుగా కొడుకుగా పుట్టాడో అటువంటి మహారాజు నాభికి సాటి కాగల రాజు లెవరూ భూమండలంలో లేరు.

## 5.1-62-వ.

### అంత.

టీక:- అంతన్ = అంతట.

భావము:- అప్పుడు...

## భరతుని జన్మంబు

5.1-63-సీ.

భూవరుఁ డగు ఋషభుఁడు దన రాజ్యంబుఁ-
గర్మభూమిఁగ నాత్మఁ గాంచి జనుల
కందఱకును బ్రియం బగునట్లు కర్మ తం-
త్రంబెల్లఁ దెలుపంగఁ దలఁచి కర్మ
ములు చేయుటకు గురువులయొద్ద వేదంబు-
చదివి వారల యనుజ్ఞను వహించి
శతమన్యుఁ డిచ్చిన సతి జయంతీ కన్యఁ-
బరిణయంబై యట్టి పడఁతి వలన

5.1-63.1-తే.

భరతుఁ డాదిగ సుతుల నూర్వురను గాంచె
నట్టి భరతుని పేరను నవనితలము
పురవరాశ్రమ గిరితరుపూర్ణ మగుచు
నమరి భారత వర్ష నామమున మించె.

టీక:- భూవరుడు = రాజు {భూవరుడు – భూమికి వరుడు (భర్త), రాజు}; అగు = అయిన; ఋషభుడు = ఋషభుడు; తన = తన యొక్క; రాజ్యంబున్ = రాజ్యమును; కర్మభూమిగన్ = కర్మభూమిగా; ఆత్మన్ = మనసున; కాంచి = చూసి; జనుల్ =

ప్రజల; కున్ = కు; అందఱకున్ = అందరికిని; ప్రియంబున్ = ఇష్టము; అగునట్లు = అగునట్లు; కర్మ = వేదకర్మల; తంత్రంబున్ = విధానమును; తెలుపన్ = తెలుసుకొన; తలంచి = భావించి; కర్మములున్ = వేదకర్మలను; చేయుట = చేయుట; కున్ = కు; గురువుల = గురువుల; యొద్దన్ = వద్ద; వేదంబున్ = వేదములను; చదివి = చదువుకొని; వారల = వారి యొక్క; అనుజ్ఞనున్ = అనుమతిని; వహించి = స్వీకరించి; శతమన్యుడు = శతమన్యుడు; ఇచ్చిన = ఇచ్చినట్టి; సతిన్ = స్త్రీని; జయంతీ = జయంతి యనెడి; కన్యన్ = కన్యను; పరిణయంబున్ = వివాహము; ఐ = అయ్యి; అట్టి = ఆ యొక్క; పడతి = స్త్రీ; వలన = వలన.

భరతుడు = భరతుడు; ఆదిగ = మొదలైన; సుతులన్ = పుత్రులను; నూర్వురన్ = నూరుమందిని; కాంచెన్ = పుట్టించెను; అట్టి = అటువంటి; భరతుని = భరతుని; పేరను = పేరుతో; అవనితలమున్ = భూమండలము; పురవర = ఉత్తమమైన పురములు; ఆశ్రమ = ఆశ్రమములు; గిరి = పర్వతములు; తరు = వృక్షములతో; పూర్ణము = నిండినది; అగుచున్ = అగుచూ; అమరి = చక్కగానుండెడి; భారతవర్ష = భారతవర్షముయనెడి; నామమునన్ = పేరుతో; మించెన్ = అతిశయించెను.

భావము:- ఋషభ మహారాజు తన రాజ్యాన్ని కర్మభూమిగా భావించి, కర్మతంత్రాన్ని జనులందరికీ ఇష్టమయ్యే విధంగా తెలియజేయాలనుకున్నాడు. అందుచేత కర్మలు ఆచరించడానికి తానే స్వయంగా గురువుల వద్దకు చేరాడు. వారి ఆజ్ఞను శిరసావహించి శతమన్యుడు ఇచ్చిన జయంతి అనే కన్యను వివాహం చేసుకున్నాడు. ఆ జయంతి వల్ల భరతుడు మొదలైన వందమంది కొడుకులను కన్నాడు. పట్టణాలతో, ఆశ్రమాలతో, కొండలతో, చెట్టు చేమలతో నిండిన భూమండలం భరతుని పేరు మీదుగా భరతవర్షం అనే ప్రశస్తిని పొందింది.

5.1-64-వ.

ఆ మహాభారతవర్షంబునందుఁ దమతమ పేరంబరఁగు భూము
లకుఁ గుశావర్తేలావర్త బ్రహ్మావర్తార్యావర్త మలయకేతు భద్రసే
నేంద్రస్పృగ్వి దర్భ కీకటులను తొమ్మండ్రు కుమారులను
దక్కంగల తొమ్మండ్రు పుత్రులకుఁ బ్రధానులం జేసె; నంతం
గవి హర్యంతరిక్ష ప్రబుద్ధ పిప్పలాయ నావిర్హోత్ర ద్రమీఢ చమస
కరభాజను లనువారు తొమ్మండ్రును భాగవత ధర్మప్రకాశకు
లైరి; భగవన్మహి మోపబృంహితంబు లగు వారల చరిత్రం
బులు ముంద రెఱింగించెదఁ; దక్కిన యెనుబదియొక్క
కుమారులు పిత్రాదేశకరులు నతి వినీతులు మహాశ్రోత్రియులు
యజ్ఞశీలురుఁ గర్మనిష్ఠులు నయిన బ్రాహ్మణోత్తము లైరి;
ఋషభుండు స్వతంత్రుండై సంసారధర్మంబులం బొరయక
కేవలానందానుభవుం డయిన యీశ్వరుండై యుండియు
బ్రాకృతుండునుం బోలెఁ గాలానుగతంబు లగు ధర్మంబుల
నాచరించుచు ధర్మప్రవర్తకులకు సముండును నుపశాంతుం
డును మైత్రుండును గారుణికుండును నై ధర్మార్థ యశః
ప్రజానందామృతావరోధంబుచే గృహస్థాశ్రమంబులం బ్రజల
నియమించుచుఁ గొంత కాలంబు నీతిమార్గంబు దప్పక
ప్రజాపాలనంబు చేయుచు వేదరహస్యంబు లగు సకల

ధర్మంబులును స్వవిదితంబు లయినను బ్రాహ్మణోపదేశ పూర్వకంబుగా ద్రవ్య దేశ కాల వయశ్శ్రద్ధర్త్విగ్వి ధోద్దేశోపచితం బులుగ నొక్కక్క క్రతువును శతవారంబు యథావిధిగఁ జేసి సుఖం బుండె; నంత.

టీక:- ఆ = ఆ; మహా = గొప్ప; భారతవర్షంబున్ = భారతవర్షము; అందున్ = అందు; తమతమ = వారివారి; పేరన్ = పేర్లతో; భూముల్ = దేశముల; కున్ = కు; కుశావర్త = కుశావర్తుడు {కుశావర్తము - నేర్పరులు కల దేశము}; ఇలావర్త = ఇలావర్తుడు {ఇలావర్తము - గో భూమి}; బ్రహ్మావర్త = బ్రహ్మావర్తుడు {బ్రహ్మావర్తము - బ్రహ్మ జ్ఞానులు తిరిగెడి నేల}; ఆర్యావర్త = ఆర్యావర్తుడు {ఆర్యావర్తము - ఆర్యులు తిరిగెడి నేల}; మలయకేతు = మలయకేతుడు {మలయకేతు - మలయు (తపసు చేయుటకు) కేతు (గుర్తు కలది), తపో భూమి}; భద్రసేన = భద్రసేనుడు {భద్రసేన - శుభము అధికముగ కల ప్రదేశము}; ఇంద్రస్పృక్ = ఇంద్రస్పృశుడు {ఇంద్రస్పృక్ - ఇంద్రుడు స్పర్శించెడ ప్రదేశము}; విదర్భ = విదర్భుడు {విదర్భ - శ్రేష్ఠమైన దర్భలు గల దేశము}; కీకటుల్ = కీకటుడు {కీకట - గ్రామ ప్రదేశము}; అను = అనెడి; తొమ్మండ్రన్ = తొమ్మిదిమంది; కుమారులన్ = పుత్రులను; తక్కుంగల = మిగిలినవారైన; తొమ్మండ్రున్ = తొమ్మిదిమంది; పుత్రుల = కుమారుల; కున్ = కు; ప్రధానులన్ = ప్రధానులుగ; చేసెన్ = చేసెను; అంతన్ = అంతట; కవి = కవి; హరి = హరి; అంతరిక్ష = అంతరిక్షుడు; ప్రబుద్ధ = ప్రబుద్ధుడు; పిప్పలాయన = పిప్పలాయనుడు; అవిర్హోత్ర = అవిర్హోత్రుడు; ధ్రమీఢ = ధ్రమీఢుడు; చమస = చమసుడు; కరభాజనులు = కరభాజనుడు; అను = అనెడి; వారు = వారు; తొమ్మండ్రునున్ = తొమ్మిదిమంది; భాగవత = భాగవత; ధర్మ = ధర్మమును; ప్రకాశకులు = విస్తరించువారు; ఐరి = అయిరి; భగవత్ = భగవంతుని; మహిమ = గొప్పదనమును; ఉపబృంహితంబులు = వ్యాప్తిచేయునవి; అగు = అయిన; వారల = వారి యొక్క; చరిత్రంబులున్ = వర్తనలు; ముందఱన్ = ముందు; ఎఱింగించెదన్

= తెల్పెదను; తక్కిన = మిగిలిన; ఎనుబదియొక్క = ఎనభైఒక్క (81); కుమారులున్ = పుత్రులు; పితృ = తండ్రి; ఆదేశ = ఆజ్ఞలను; కరులున్ = పాలించువారు; అతి = మిక్కిలి; వినీతులున్ = నీతిమంతులు; మహా = గొప్ప; శ్రోత్రియులున్ = వేదమార్గ నిష్ఠ గలవారు; యజ్ఞ = యజ్ఞములను; శీలురు = స్వభావము గలవారు; కర్మ = వేదకర్మాచరణలో; నిష్ఠులున్ = నిష్ఠ గలవారు; అయిన = అయిన; బ్రాహ్మణ = బ్రాహ్మణులలో; ఉత్తములు = ఉత్తములు; ఐరి = అయ్యిరి; ఋషభుండు = ఋషభుడు; స్వతంత్రుండు = స్వతంత్రుడు; ఐ = అయ్యి; సంసార = గృహస్తు; ధర్మములన్ = ధర్మములను; పొరయక = చెందక; కేవల = కేవలము; ఆనంద = ఆనందమును; అనుభవుండు = అనుభవించు చుండెడివాడు; అయిన = అయినట్టి; ఈశ్వరుండు = భగవంతుడు; ఐ = అయ్యి; ఉండియున్ = ఉన్నప్పటికిని; ప్రాకృతుండునున్ = పామరుని; పోలెన్ = వలె; కాల = కాలమునకు; అనుగతంబులు = అనుసరించునవి; అగు = అయిన; ధర్మంబులన్ = ధర్మములను; ఆచరించుచున్ = ఆచరించుతూ; ధర్మ = ధర్మమును; ప్రవర్తకుల్ = నడిపించెడివారి; కున్ = కి; సముండునున్ = తగినవాడును; ఉపశాంతుండునున్ = ఉపశమనము కూర్చెడివాడు; మైత్రుండునున్ = మిత్రుడును; కారుణికుండును = ప్రయోజనములను కలిగించెడివాడు; ధర్మ = ధర్మము; అర్థ = సంపదలు; యశః = కీర్తి; ప్రజా = సంతానము; ఆనంద = ఆనందములు; అమృత = అమృతముల; అవరోధంబున్ = ఊడలుదిగట; చేన్ = వలన; గృహస్థ = గార్హస్థ; ఆశ్రమంబులన్ = ఆశ్రమములో; ప్రజలన్ = లోకులను; నియమించుచున్ = నియమిస్తూ; కొంత = కొంత; కాలంబున్ = సమయము; నీతి = నీతి; మార్గంబున్ = దారి; తప్పక = తప్పి పోకుండగ; ప్రజా = ప్రజలను; పాలనంబున్ = పరిపాలించుట; చేయుచున్ = చేయుచూ; వేద = వేదము లందలి; రహస్యంబులు = రహస్యములు; అగు = అయిన; సకల = సర్వ; ధర్మంబులునున్ = ధర్మములు; స్వ = తనకు; విదితంబులు = తెలిసినవే; అయినను = అయినప్పటికి; బ్రాహ్మణ = బ్రాహ్మణులచే; ఉపదేశ = ఉపదేశింప బడుట; పూర్వకంబుగాన్ = కూడినదిగాను; ద్రవ్య = పదార్థములు; దేశ = ప్రదేశముల; కాల = సమయముల; వయస్ = వయస్సులు; శ్రద్ధా = శ్రద్ధ; ఋత్విక్ = యజ్ఞ

నిర్వహకులు; విధ = విధానములు; ఉద్దేశ = ఉద్దేశ్యములు; ఉపచితంబులుగన్ = సరగునవిసంపాదించి; ఒక్కొక్క = ప్రతి ఒక్క; క్రతువును = యజ్ఞమును; శత = నూరు (100); వారంబున్ = మారులు, పర్యాయములు; యథావిధిగన్ = పద్ధతి ప్రకారముగ; చేసి = చేసి; సుఖంబున్ = సుఖముగా; ఉండెన్ = ఉండెను; అంత = అంతట.

భావము:- ఆ భరతవర్షంలోని ఆయా భాగాలకు భరతుడు తన తొంబది తొమ్మిది మంది సోదరులలో కుశావర్తుడు, ఇలావర్తుడు, బ్రహ్మావర్తుడు, ఆర్యావర్తుడు, మలయకేతువు, భద్రసేనుడు, ఇంద్రస్పృశుడు, విదర్భుడు, కీకటుడు అనే తొమ్మిది మందిని ప్రధానులుగా నియమించాడు. వారి కప్పగించిన భూభాగాలు వారి వారి పేర్లతో ప్రసిద్ధి పొందాయి. కవి, హరి, అంతరిక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, అవిర్హోత్రుడు, ద్రమీఢుడు, చమనుడు, కరభాజనుడు అనే తొమ్మిది మంది భాగవత ధర్మాన్ని ప్రకాశింపజేశారు. దేవుని మహిమలను వ్యాప్తి చేసే వారి చరిత్రలను నీకు తరువాత చెపుతాను. తక్కిన ఎనభైయొక్క మంది కుమారులు తమ తండ్రి ఋషభుని మాటను జవదాటనివాళ్ళు. వారంతా మహావినయ సంపన్నులు. వేదధర్మాలను అనుష్ఠించేవాళ్ళు. యాగాలన్నా కర్మలన్నా శ్రద్ధ కలవాళ్ళు. అందుచేత వాళ్ళు బ్రాహ్మణోత్తములుగా పేరు గడించారు. ఋషభుడు సాంసారిక బంధాలలో చిక్కుకొనలేదు. స్వతంత్రుడై మెలిగాడు. తాను ఆనందానుభూతి కలిగిన ఈశ్వరుడైనా సామాన్యుడిగా ప్రవర్తించాడు. ఆయా కాలాలలో చేయదగిన ధర్మాలను ఆచరించేవాడు. ధర్మ ప్రవర్తకుల పట్ల సమబుద్ధి కలిగి ఉండేవాడు. శాంతస్వభావంతో జీవుల పట్ల దయ కలిగి మైత్రీభావంతో ఉండేవాడు. ధర్మం, అర్థం, కీర్తి, సంతతి, ఆనందం. అమృతత్వం చక్కగా సాగడం కోసం గృహస్థాశ్రమాన్ని పాటించవలసిందిగా ప్రజలను అనుశాసించేవాడు. ఈ విధంగా ఋషభుడు నీతిమార్గం తప్పకుండా ప్రజాపాలనం చేసాడు. వేదాలలోని ధర్మరహస్యాలను తనకు అవగతమైనా బ్రాహ్మణులు బోధించినట్లు, ఋత్విక్కులు ఉపదేశించినట్లు వస్తు సంభారాలతో దేశకాలానుగుణంగా శ్రద్ధాపూర్వకంగా తన వయస్సుకు తగినట్లు ఒక్కొక్క యాగాన్ని వంద పర్యాయాలు యథావిధిగా చేసి సుఖజీవనం గడిపాడు. అప్పుడు…

5.1-65-క.

జనవర ఋషభుని రాజ్యం

బున నైహిక ఫలముఁ గోరు పురుషుని నొకనిం

గనుఁగొన నెఱుంగ మెన్నఁడు

నినతేజుం డతనిమహిమ లేమని చెప్పన్.

టీక:- జనవర = రాజ; ఋషభుని = ఋషభుని; రాజ్యంబునన్ = రాజ్యములో; ఐహిక = ఇహలోకపు; ఫలమున్ = ఫలితములను; కోరు = కోరెడి; పురుషునిన్ = మానవుని; ఒకనిన్ = ఒక్కనినైన; కనుగొన = చూడగలుగుట; ఎఱుంగము = తెలియము; ఎన్నడున్ = ఎప్పుడును; ఇన = సూర్యునితో సమానమైన; తేజుండు = తేజస్సు గలవాడు; అతని = అతని యొక్క; మహిమల్ = గొప్పదనములు; ఏమని = ఏమని; చెప్పన్ = చెప్పను.

భావము:- రాజా! ఆ ఋషభుని రాజ్యంలో పారలౌకిక ఫలమే తప్ప ఇహలోకఫలం కోరేవాడు ఒక్కడు కూడా కనిపించడు. అతడు సూర్యుని వంటి తేజస్సు కలవాడు. అతని మహిమలను ఏమని వర్ణించాలి?

## ఋషభుని తపంబు

5.1-66-సీ.

ఆ ఋషభుండు రాజ్యంబు చేయుచు నుండి-

యంతట నొక్కనాఁ డాత్మయందుఁ

దలపోసి భూలోక ఫల మపేక్షింపక-

మోహంబు దిగనాడి పుత్రులకును

దనరాజ్య మెల్ల నప్పన చేసి వెనువెంటఁ-

గొడుకులు మంత్రులుఁ గొలిచిరాఁగ

నల్లన యరిగి బ్రహ్మావర్త దేశంబు-

నందుల నపుడు మహాత్ములయిన

5.1-66.1-తే.

యట్టి మునిజన సమ్ముఖంబందుఁ జేరి

తనదు పుత్రుల నందఱ డాయఁ బిలిచి

పరమ పుణ్యుండు ఋషభుండు ప్రణయ మొప్ప

హర్ష మందుచు నప్పు డిట్లనుచుఁ బలికె.

టీక:- ఆ = ఆ; ఋషభుండు = ఋషభుడు; రాజ్యంబున్ = రాజ్యమును; చేయుచు నుండి = చేయుచూ; అంతటన్ = అంతట; ఆత్మ = మనసు; అందున్ = లో; తలపోసి = భావించి; భూలోక = భూలోకమునకు సంబంధించిన; ఫలమున్ =

ఫలితములను; అపేక్షింపక = ఆశించకుండగ; మోహంబున్ = మోహమును; దిగనాడి = వదలివేసి; పుత్రులు = కుమారుల; కునున్ = కు; తన = తనయొక్క; రాజ్యము = రాజ్యము; ఎల్లన్ = అంతటిని; అప్పనజేసి = అప్పజెప్పి; వెనువెంటన్ = కూడా; కొడుకులున్ = కుమారులు; మంత్రులున్ = మంత్రులు; కొలిచి = సేవించుతూ; రాగ = వస్తుండగా; అల్లన = మెల్లగా; అరిగి = వెళ్ళి; బ్రహ్మావర్త = బ్రహ్మావర్తము యనెడి; దేశంబున్ = దేశముల; అందులన్ = లో; అపుడున్ = అప్పుడు; మహాత్ములు = గొప్పవారు; అయిన = అయిన.

అట్టి = అటువంటి; ముని = మునులైన; జన = వారి; సమ్ముఖంబున్ = ఎదుటి; అందున్ = అందు; చేరి = చేరి; తనదు = తన యొక్క; పుత్రులన్ = కుమారులను; అందఱన్ = అందరిని; డాయన్ = దగ్గరకు; పిలిచి = పిలిచి; పరమ = అత్యుత్తమ; పుణ్యుండు = పుణ్యముగలవాడు; ఋషభుండు = ఋషభుడు; ప్రణయమొప్ప = ప్రేమయుప్పొంగగా; హర్షమున్ = సంతోషమును; అందుచున్ = పొందుతూ; అప్పుడున్ = అప్పుడు; ఇట్లు = ఈ విధముగ; అనుచున్ = అంటూ; పలికెన్ = పలికెను.

భావము:- ఆ ఋషభుడు రాజ్యపాలన చేస్తూ ఒకనాడు ఇహలోక ఫలాన్ని అపేక్షించక, మోహాన్ని వదలిపెట్టి, కొడుకులకు రాజ్యమంతా అప్పగించాడు. తరువాత కొడుకులు, మంత్రులు తనను అనుసరించగా బ్రహ్మావర్త దేశానికి బయలుదేరాడు. అక్కడ మహాత్ములైన మునిజనుల సమక్షంలో కుమారుల నందరినీ దగ్గరకు పిలిచి మహాపుణ్యాత్ముడైన ఋషభుడు సంతోషంతో ఇలా అన్నాడు.

## 5.1-67-ఆ.

"తనయులార! వినుఁడు ధరలోనఁ బుట్టిన
పురుషులకును శునకములకు లేని
కష్టములను దెచ్చుఁ గానఁ గామంబుల
వలన బుద్ధి చేయవలదు మీరు

టీక:- తనయులారా = కుమారులారా; వినుడు = వినండి; ధర = భూమి; లోనన్ = అందు; పుట్టిన = పుట్టిన; పురుషుల్ = పురుషుల; కునున్ = కు; శునకముల్ = కుక్కల; కున్ = కైనను; లేని = లేనట్టి; కష్టములన్ = కష్టములను; తెచ్చున్ = తీసుకువచ్చును; కాన = కనుక; కామంబులన్ = కోరికల; వలనన్ = వలన; బుద్ధి = మనసు; చేయవలదు = పడవద్దు; మీరు = మీరు.

భావము:- "కుమారులారా! ఈ భూమిమీద పుట్టిన మనుష్యులు కామానికి లొంగిపోతే కుక్కలకు కూడా రాని కష్టాలు వారికి ఎదురవుతాయి. అందువల్ల కోరికలకు మీరు దూరంగా ఉండాలి.

5.1-68-చ.

**నరులకు నే తపంబు ననంత సుఖంబులు గల్గుచుండు, శ్రీ**
**కరమతి నా తపంబుఁ దగఁ గైకొని చేసిన బ్రహ్మసౌఖ్యముం**
**దిరముగఁ గల్గు; వృద్ధులను దీనులఁ బ్రోవుఁడు; దుష్ట వర్తనన్**
**జరుగుచునుండు కాముకుల సంగతిఁ బోకుఁడు; మీఁద మేలగున్.**

టీక:- నరుల్ = మానవుల; కున్ = కు; ఏ = ఏ విధమైన; తపంబునన్ = తపస్సుతో; అనంత = అనంతమైన, అత్యధికమైన; సుఖంబులున్ = సుఖములు; కల్గుచుండున్ = కలుగుతూ యుండును; శ్రీ = శుభ; కర = కరమమైన; మతిన్ = మనసున; ఆ = ఆ; తపంబున్ = తపస్సును; తగన్ = అవశ్యము; కైకొని = చేపట్టి; చేసిన = చేసినట్టి; బ్రహ్మసౌఖ్యమున్ = బ్రహ్మానందము (ముక్తి); తిరముగన్ = స్థిరముగ; కల్గు = కలిగించెడి; వృద్ధులనున్ = ముసలివారిని; దీనులన్ = దీనులను; ప్రోవుడు = కాపాడండి; దుష్ట = చెడ్డ; వర్తనన్ = ప్రవర్తనతో; జరుగుచునుండు = నడచెడి; కాముకులన్ = కాముకుల; సంగతిన్ = సాంగత్యమునకు; పోకుడు = పోకండి; మీదన్ = రాబోవు కాలములో; మేలున్ = మంచి; అగున్ = అగును.

భావము:- ఏ తపస్సు వల్ల మానవులకు తరగని సుఖం లభిస్తుందో అలాంటి తపస్సును అవలంబిస్తే బ్రహ్మానందం తప్పక సిద్ధిస్తుంది. వృద్ధులను, దీనులను

దయతో కాపాడండి. చెడు మార్గాలలో నడిచే కాముకుల సహవాసాన్ని పూర్తిగా వదలిపెట్టండి. మీకు శుభం కలుగుతుంది.

5.1-69-వ.

మఱియు నంగనాసక్తులగు కాముకుల సంగంబు నిరయ రూపం బయిన సంసారంబగు; మహత్సంగంబు మోక్షద్వారం బగు; నట్టి మహాత్ము లెవ్వ రనిన శత్రు మిత్ర వివేకంబు లేక సమచిత్తులును శాంతులును గ్రోధరహితులును సకలభూత దయాపరులును సాధువులును నగువారలు మహాత్ము లనం దగుదు; రట్టి మహాత్ములు నా యందలి స్నేహంబె ప్రయోజనం బుగాఁ గలిగి యుండుటం జేసి విషయ వార్తా ప్రవృత్తు లగు కుజనులందుఁ దమ దేహ గృహ మిత్ర దారాత్మ జాదులందుఁ బ్రీతిలేక యుండుదురు; విషయాసక్తుఁ డయిన వాఁడు వ్యర్థ కర్మంబులం జేయు నట్టి దుష్కృత కర్మంబులం జేయువాఁ డెప్పుడును బాపకర్ముం డగుచుం గ్లేశదంబగు దేహంబు నొందుచుండుఁ; గావునఁ బాపమూలంబు లయిన కామం బులు గోరకుఁ; డీ జ్ఞానం బెంత కాలంబుఁ లేకయుండు నంత కాలంబు నాత్మతత్త్వం బెఱుంగంబడ; దా తత్త్వం బెఱుంగ కుండుటజేసి దేహికి దుఃఖం బధికంబై యుండు; లింగదేహం బెంత దడ వుండు నంత దడవును మనంబు కర్మవశంబై

జ్ఞానవంతంబుగాక యవిద్యం బాయకుండు; శరీరంబు గర్మమూలం బగుట వలనఁ గర్మంబులు చేయఁ జనదు; వాసుదేవుం డగు నా యందుఁ బ్రీతి యెంత తడవు లేక యుండు నంతదడవును దేహధర్మంబులు బాధించు; విద్వాంసుడైనను దేహేంద్రియాదుల యందుఁ బ్రీతిచేసిన మిథునీ భావ సుఖప్రధానం బగు గృహస్థాశ్రమంబు నంగీకరించి స్వరూప స్మృతి శూన్యుండై మూఢుం డగుచు, నందు సంసార తాపంబులఁ బొందుఁ; బురుషుండు స్త్రీతోడం గూడి యేకీభావంబు నొందుట దనకు హృదయ గ్రంథియై యుండు; నందు జనునకు గృహక్షేత్ర సుతాప్త విత్తంబులందు "నేను నాయది" యనియెడి మోహంబు గలుగు; నట్టి స్త్రీపురుష మిథునీ భావంబుచే సంతానంబు గలుగు; నా సంతాన కారణంబున గృహక్షేత్ర విత్తాదులు సంపాదింపంబడు; నందు మోహం బధికం బగుటంజేసి మోక్షమార్గంబు దవ్వగు; నిట్లు సంసారంబునం దుండియు మనంబున నెపుడు ముక్తిచింతం జేయు నప్పుడు సంసారంబును బాయు; మోక్షోపాయంబులు పరమ గురుండనైన నా యందుల భక్తి చేయుటయు, విగతతృష్ణయు, ద్వంద్వ తితిక్షయు, సర్వలోకంబు లందుల జంతు వ్యసనావగతియు, నీశ్వరవిషయక జ్ఞానాపేక్షయుఁ, దపంబును, విగతే

చ్ఛయు, మత్కృతకర్మంబులు మత్కథలు వినుటయు, నన్నె దైవంబుగా నెఱుంగుటయు, నస్మద్గుణ కీర్తనంబులును, నిర్వై రత్వసామ్యోపశమంబులును, దేహ గేహంబులందు నాత్మ బుద్ధి జిహాసయు, నధ్యాత్మ యోగం బును, నేకాంతసేవయుఁ, బ్రాణేంద్రియాత్మలఁ గెలుచుటయుఁ, గర్తవ్యాపరిత్యాగంబును, సచ్ఛ్రద్ధయు, బ్రహ్మచర్యంబును, గర్తవ్యకృత్యంబు లందుల నప్రమత్తుండగుటయు, వాఙ్నియ మనంబును, సర్వంబు నన్నకా దలంచుటయు, జ్ఞానంబును, విజ్ఞాన విజృంభితంబైన యోగంబును, ధృత్యుద్యమంబును, సాత్త్వికంబును నాదిగాఁ గల తెఱంగుల చేత లింగదేహంబు జయించి దేహి కుశలుం డగుచు నుండవలయు.

టీక:- మఱియున్ = ఇంకను; అంగనా = స్త్రీల ఎడ; ఆసక్తులు = లాలస గలవారు; అగున్ = అయిన; కాముకులన్ = కాముకుల తోడి; సంగంబున్ = సాంగత్యము; నిరయ = నరక; రూపంబు = రూపమన ఉన్నది; అయిన = అయిన; సంసారంబు = సంసారము; అగున్ = అగును; మహత్ = గొప్పవారి తోడి; సంగంబున్ = సాంగత్యము; మోక్ష = ముక్తికి; ద్వారంబున్ = దారితీయించెడిది; అగున్ = అగును; అట్టి = అటువంటి; మహాత్ములు = గొప్పవారు; ఎవ్వరు = ఎవరు; అనినన్ = అన్నచో; శత్రు = శత్రువులు; మిత్ర = మిత్రులు; వివేకంబు = అనెడి ఆలోచన; లేక = లేకుండగ; సమ = సమత్వము గల; చిత్తులును = మనసు గలవారు; శాంతులును = శాంతస్వభావులు; క్రోధ = కోపము; రహితులును = లేనివారు; సకల = సర్వ; భూత = జీవుల ఎడ; దయాపరులును = దయ గలవారును; సాధువులును = సాధుస్వభావులును; అగు = అయిన; వారలు = వారు; మహాత్ములు = గొప్పవారు;

అనన్ = అనుటకు; తగుదురు = తగినవారు; అట్టి = అటువంటి; మహాత్ములు = గొప్పవారు; నా = నా; అందలి = ఎడ; స్నేహంబె = ప్రీతి మాత్రమే; ప్రయోజనంబుగా = లాభముగా; కలిగి = కలిగి; ఉండుటన్ = ఉండుట; చేసి = వలన; విషయ = ఇంద్రియార్థముల యందు; వార్తా = వర్తించుట; ప్రవృత్తులు = ప్రవర్తనగా కలవారు; అగు = అయిన; కు = చెడ్డ; జనులు = వారు; అందున్ = ఎడల; తమ = తమ; దేహ = శరీరము; గృహ = ఇల్లు; మిత్ర = హితులు; దార = భార్య; ఆత్మజ = సంతానము; ఆదులు = మొదలగువారి; అందున్ = ఎడల; ప్రీతి = మిక్కిలి ఆసక్తి; లేక = లేకుండగ; ఉండుదురు = ఉంటారు; విషయ = ఇంద్రియార్థము లందు; ఆసక్తుడు = తగులుకొన్నవాడు; అయిన = అయినట్టి; వాడు = వాడు; వ్యర్థ = అనవసర; కర్మంబులన్ = కర్మములను; చేయున్ = చేయును; అట్టి = అటువంటి; దుష్కృత = చెడ్డపనులైన; కర్మంబులన్ = కర్మములను; చేయువాడు = చేసెడివాడు; ఎప్పుడునున్ = ఎప్పుడును; పాపకర్ముండు = పాపము చేసినవాడు; అగుచున్ = అగుచూ; క్లేశదంబున్ = చిక్కులను కలిగించెడివి; అగు = అయిన; దేహంబున్ = జన్మములను; ఒందుచుండు = పొందుచుండును; కావునన్ = అందుచేత; పాప = పాపమును; మూలంబులు = కలిగించునవి; అయిన = అయిన; కామంబులన్ = కామములను; కోరకుడు = కోరుకొనకండి; ఈ = ఈ విధమైన; జ్ఞానంబున్ = జ్ఞానము; ఎంతకాలంబున్ = ఎంతకాలమైతే; లేక = లేకుండగా; ఉండున్ = ఉండునో; అంతకాలము = అంతవరకు; ఆత్మతత్త్వంబున్ = ఆత్మతత్త్వము; ఎఱుంగబడదు = తెలియదు; ఆ = ఆ; తత్త్వంబున్ = తత్త్వము; ఎఱుంగకుండుట = తెలియకపోవుట; చేసి = వలన; దేహి = జీవుని {దేహి - దేహము ధరించినవాడు, జీవుడు}; కిన్ = కి; దుఃఖంబు = దుఃఖము; అధికంబున్ = ఎక్కువగా; ఐ = కలిగి; ఉండు = ఉండును; లింగదేహంబు = లింగదేహము {లింగదేహము - పూర్వసంస్కార రూపమైన దేహము}; ఎంతతడవున్ = ఎంత వరకు; ఉండున్ = ఉండునో; అంతతడవునున్ = అంత వరకు; మనంబున్ = మనసు; కర్మ = కర్మములకు; వశంబున్ = లొంగినది; ఐ = అయ్యి; జ్ఞానవంతంబున్ = జ్ఞానము గలిగినది; కాక = కాకుండగా; అవిద్యన్ = మాయను {అవిద్య - ఆత్మతత్త్వ విద్యకు అన్యమైనది, మాయ}; పాయక = విడువడక;

ఉండున్ = ఉండును; శరీరంబు = జన్మములు; కర్మ = కర్మములు; మూలంబులు = ఆధారభూతముగా కలవి; అగుటన్ = అగుట; వలనన్ = వలన; కర్మంబులున్ = కర్మములను; చేయన్ = చేయుట; చనదు = తగదు; వాసుదేవుండు = నారాయణుడు {వాసుదేవుడు - (సర్వభూతము లందు) వసించెడి దేవుడు, విష్ణువు}; అగు = అయిన; నా = నా; అందున్ = ఎడల; ప్రీతిన్ = భక్తిని; ఎంతతడవున్ = ఎంతవరకు; లేక = లేకుండగ; ఉండున్ = ఉండునో; అంతతడవునున్ = అంత వరకు; దేహ = శారీరక; ధర్మంబులు = ధర్మములు; బాధించున్ = బాధించును; విద్వాంసుడు = జ్ఞాని; ఐననున్ = అయినప్పటికని; దేహ = దేహము నందు; ఇంద్రియ = ఇంద్రియార్థముల; అందున్ = ఎడల; ప్రీతిన్ = మిక్కిలి ఆసక్తి; చేసిన = కలిగిన; మిథునీ = దాంపత్య; భావ = భావము నందలి; సుఖ = సుఖములు; ప్రధానంబు = ముఖ్య మగునవి; అగు = అయిన; గృహస్థాశ్రమంబున్ = గృహస్థు జీవితమును; అంగీకరించి = స్వీకరించి; స్వరూప = తన తత్త్వము యొక్క; స్మృతి = జ్ఞానము, తలపు; శూన్యుండు = లేనివాడు; ఐ = అయ్యి; మూఢుండున్ = తెలివి లేనివాడు; అగుచున్ = అగుచూ; అందున్ = దానిలో; సంసార = సాంసారిక; తాపంబులన్ = బాధలను; పొందున్ = పొందెడి; పురుషుండు = పురుషుడు; స్త్రీ = స్త్రీ; తోడన్ = తోటి; కూడి = కలిసి; ఏకీభావంబున్ = కలియుట; ఒందుట = పొందుట; తన = తన; కున్ = కు; హృదయగ్రంథి = హృదయ మనెడి బంధనము; ఐ = అయ్యి; ఉండున్ = ఉండును; అందున్ = దానిలో; జనున్ = మానవుని; కున్ = కి; గృహ = ఇల్లు; క్షేత్ర = భూములు; సుత = పుత్రులు; ఆప్త = బంధువులు; విత్తంబున్ = సంపదలు; అందున్ = ఎడల; నేను = నేను, అహంకారము; నాయది = నాది, మమకారము; అనియెడి = అనెడి; మోహంబున్ = మోహములు; కలుగును = ఏర్పడును; అట్టి = అటువంటి; స్త్రీపురుష = స్త్రీపురుషుల; మిథునీ = దాంపత్య; భావంబు = భావము; చేన్ = వలన; సంతానంబున్ = పిల్లలు; కలుగున్ = కలుగును; ఆ = ఆ; సంతాన = సంతానము; కారణంబునన్ = వలన; గృహ = ఇళ్ళు; క్షేత్ర = భూములు; విత్త = సంపదలు; ఆదులు = మొదలగునవి; సంపాదింపంబడు = సంపాదింపబడును; అందున్ = వాని ఎడ; మోహంబున్ = మోహము;

అధికంబున్ = ఎక్కువ; అగుటన్ = అగుట; చేసి = వలన; మోక్ష = ముక్తికి చేరెడి; మార్గంబున్ = దారి; దవ్వగు = దూరము అగును; ఇట్లు = ఈ విధముగ; సంసారంబున్ = సంసారము; అందున్ = లో; ఉండియున్ = ఉండి కూడ; మనంబునన్ = మనసులో; ఎప్పుడున్ = ఎల్లప్పుడు; ముక్తి = మోక్షమును గూర్చిన; చింతన్ = చింతనను; చేయున్ = చేయునో; అప్పుడున్ = అప్పుడు; సంసారంబునున్ = సంసారమును; పాయును = దూరము అగును; మోక్ష = ముక్తిని పొందెడి; ఉపాయంబులున్ = ఉపాయములు; పరమ = అత్యుత్తమ; గురుండను = గురువును; ఐన = అయిన; నా = నా; అందులన్ = ఎడల; భక్తి = భక్తిని; చేయుటయు = కలిగి ఉండుట; విగత = వదలివేసిన; తృష్ణయున్ = వాంఛలు; ద్వంద్వ = శీతోష్ణాది ద్వంద్వములను; తితిక్షయున్ = ఓర్చుకొనుట; సర్వ = అన్ని; లోకంబులన్ = లోకముల; అందులన్ = లోని; జంతు = జంతువుల; వ్యసన = బాధలను; అవగతియున్ = అర్థము చేసికొనుట; ఈశ్వర = భగవంతునికి; విషయక = చెందిన విషయముల యొక్క; జ్ఞాన = విజ్ఞానము నందు; ఆపేక్షయున్ = ఆసక్తి; తపంబునున్ = తపస్సు; విగత = విడిచిపెట్టిన; ఇచ్ఛయున్ = కోరికలు; మత్ = నా చేత; కృత = చేయబడెడి; కర్మంబులున్ = పనులు; మత్ = నా యొక్క; కథలు = కథలు; వినుటయున్ = వినుట; నన్నె = నన్ను మాత్రమే; దైవంబు = భగవంతుని; కాన్ = అగునట్లు; ఎఱుంగుటయున్ = తెలియుట; అస్మత్ = నా యొక్క; గుణ = సుగుణముల; కీర్తనంబులున్ = స్తుతించుటలు; నిర్వైరత్వ = వైరభావము లేకపోవుట; సామ్య = సమత్వభావము; ఉపశమంబులున్ = శాంతములు; దేహ = శరీరము; గేహంబులున్ = ఇళ్ళు; అందున్ = ఎడల; ఆత్మ = నాది, మమకారము; బుద్ధి = బుద్ధిని; జిహాసయున్ = విడుచుట; అధ్యాత్మ = ఆధ్యాత్మిక; యోగంబునున్ = యోగము; ఏకాంతసేవయున్ = అనన్య సేవయు; ప్రాణ = ప్రాణములు; ఇంద్రియ = ఇంద్రియములు; ఆత్మలన్ = ఆత్మలను; గెలుచుటయున్ = గెలుచుట; కర్తవ్య = చేయవలసిన పనులను; అపరిత్యాగంబును = విడువకుండుట; సత్ = మంచి యందు; శ్రద్ధయున్ = శ్రద్ధ; బ్రహ్మచర్యంబును = బ్రహ్మచర్యము; కర్తవ్య = చేయవలసిన; కృత్యంబులు = పనులు; అందులన్ = లలో; అప్రమత్తుండు =

ఏమరుపాటు లేకుండువాడు; అగుటయున్ = అగుట; వాక్ = మాటలను వాడుట యందు; నియమనంబును = సంయమనము; సర్వంబున్ = సమస్తమును; నన్న = నన్ను మాత్రమే; కాన్ = అగునట్లు; తలంచుటయున్ = భావించుట; జ్ఞానంబునున్ = జ్ఞానము; విజ్ఞాన = విజ్ఞానమువలన; విజృంభితంబు = అతిశయించినది; ఐన = అయిన; యోగంబునున్ = యోగము; ధృతి = ధైర్యము; ఉద్యమంబునున్ = వహించి యుండుట; సాత్వికంబున్ = సత్త్వగుణము కలిగి ఉండుట; ఆది = మొదలగునవి; కాగల = ఐయున్న; తెఱంగులన్ = విదానముల; చేతన్ = వలన; లింగదేహంబున్ = లింగదేహమును; జయించి = గెలిచి; దేహి = జీవుడు; కుశలుండు = క్షేమము గలవాడు; అగుచునుండవలయున్ = అగుచూ ఉండవలెను.

భావము:- ఇంకా స్త్రీ వ్యామోహంలో ఉండే కాముకులతో సంబంధం వల్ల సంసారం నరకమే అవుతుంది. మహాత్ముల సహవాసం మోక్షానికి దారి తీస్తుంది. అటువంటి మహాత్ములు ఎవరని అంటారా? శత్రు మిత్ర భేదభావం లేకుండా అందరిపై సమదృష్టి కలవారు, శాంతస్వభావులు, కోపం లేనివారు, సమస్త జీవుల పట్ల దయాస్వభావం కలవారు, సాధు స్వభావులు మహాత్ములని పిలువబడతారు. అలాంటి మహానుభావులకు నాయందే పరిపూర్ణ భక్తి ఉండడం వల్ల విషయ లంపటులైన దుర్మార్గుల పట్ల ప్రీతి, తమ దేహమన్నా, ఇల్లన్నా, మిత్రులన్నా, భార్యాపుత్రులన్నా వ్యామోహం ఏమాత్రం ఉండదు. ఇంద్రియ సుఖాలకు లోనైనవాడు పనికిరాని పనులు చేస్తూ ఉంటాడు. చెడ్డపనులు చేసేవాడు పాపం కొనితెచ్చుకుంటాడు. దుఃఖకారణమైన దేహాన్ని మోస్తూ ఉంటాడు. అందువల్ల మీరు పాపాలకు మూలాలైన కోరికలను కోరకండి. యథార్థ జ్ఞానం ప్రాప్తించనంత వరకు మీకు ఆత్మతత్త్వం బోధపడదు. ఆ తత్త్వం తెలియని కారణాన దేహికి దుఃఖం ఎక్కువవుతుంది. లింగదేహ మెంతకాలం ఉంటుందో అంతకాలం మనస్సు కర్మవశమై ఉంటుంది. జ్ఞానం లభించదు. అవిద్య వదలదు. శరీరం కర్మమూలం. అందుచేత కర్మలు చేయడం తగదు. వాసుదేవుడినైన నామీద ఆసక్తి కుదరనంత వరకు మిమ్మల్ని దేహధర్మాలు బాధిస్తాయి. ఎంత చదువుకున్న వాడైనా దేహేంద్రియ సుఖాలపట్ల ఆసక్తుడై సంభోగ సుఖ ప్రధానమైన గృహస్థాశ్రమాన్ని స్వీకరిస్తాడు. మూఢుడై సంసార

క్లేశాలకు లోనౌతాడు. సంసారికి ఇల్లన్నా, పొలాలన్నా, కొడుకులన్నా, ఆప్తులన్నా, ధనమన్నా నేను నాది అనే వ్యామోహం పెరుగుతుంది. స్త్రీ పురుషుల కలయిక వల్ల సంతానం కలుగుతుంది. ఆ సంతానం కోసం ఇల్లు కట్టడమో, పొలాలు కొనడమో, ధనం సంపాదించడమో జరుగుతుంది. వాటిపట్ల మోహం పెంచుకొనడంతో వానికి మోక్షమార్గం దూరమౌతుంది. సంసారంలో మునిగి ఉన్నవానికి ఎపుడయితే మోక్షాసక్తి కలుగుతుందో అపుడే అతడు సంసారాన్ని వదలి పెడతాడు. మోక్షోపాయం చెప్తాను. పరమేశ్వరుడనైన నా మీద భక్తి ఉండడం, కోరికలు లేకపోవడం, సుఖ దుఃఖాలలో సహనం, సమస్త జీవుల కష్టాలపట్ల సానుభూతి కలిగి ఉండడం, భగవద్విషయమైన జ్ఞానంపట్ల ఆసక్తి, తపస్సు, నా కథలను, లీలలను ఆలకించడం, నన్నే దైవంగా భావించడం, నా గుణాలను కీర్తించడం, ఎవరితోను విరోధభావం లేకుండడం, సర్వత్ర సమబుద్ధి కలిగి ఉండడం, శాంతితో జీవించడం, 'నా గేహం, నా దేహం' అనే బుద్ధిని వదలిపట్టడం, ఆధ్యాత్మయోగం అవలంబించడం, ఏకాంత భక్తిభావం, ఇంద్రియాలను జయించడం, కర్తవ్య పరాయణత్వం, సత్కార్యాలందు శ్రద్ధ, బ్రహ్మచర్యం, జాగరూకత, వాక్కులను సంయమనంతో వాడడం, అన్నిటిలో నన్నే చూడడం... ఇవి ముక్తి మార్గాలు. జ్ఞానంతో విజ్ఞాన విజృంభితమైన యోగంతో, గుండె దిటవుతో, సాత్త్వికమైన ప్రవృత్తితో లింగదేహాన్ని జయించి మానవుడు క్షేమాన్ని పొందాలి.

5.1-70-ఆ.

అరయఁ గర్మరూప మగు నవిద్యాజన్మ
మైన హృదయబంధనాది లతల
నప్రమత్తయోగ మను మహాఛురికచేఁ
ద్రెంపవలయు నంతఁ దెంపుతోడ.

టీక:- అరయన్ = తరచి చూడగా; కర్మ = కర్మముల యొక్క; రూపము = స్వరూపము; అగు = అయిన; అవిద్యన్ = అవిద్యనుండి; జన్మము = పుట్టినది; ఐన = అయిన; హృదయ = హదయ మనెడి; బంధన = గ్రంథి; ఆది = మొదలగు; లతలన్ = అల్లుకొనెడి తీగలను; అప్రమత్త = ఏమరుపాటు లేకుండెడి; యోగము = యోగము; అను = అనెడి; మహా = గొప్ప; ఛురిక = చురకత్తి; చేన్ = తోటి; త్రెంప వలయున్ = కత్తిరించవలెను; అంతన్ = అంతట; తెంపు = తెగింపు; తోడన్ = తోటి;

భావము:- అజ్ఞానం నుండి పుట్టిన హృదయ బంధనమనే తీగను యోగం అనే చురకత్తితో ధైర్యంగా తెంపివేయాలి.

5.1-71-ఆ.

ఒనర నిట్లు యోగయుక్తుండు గురుఁ డైన
భూపుఁ డైన శిష్యపుత్ర వరుల
యోగయుతులఁ జేయ నొప్పు గావలయును
గర్మపరులఁ జేయఁ గాదుకాదు.

టీక:- ఒనరన్ = తగినట్లు; ఇట్లు = ఈ విధముగ; యోగ = యోగము తోటి; యుక్తుండు = కలిసి ఉన్నవాడు; గురుడున్ = గురువును; ఐన = అయిన; భూపుడు = రాజు; ఐన = అయిన; శిష్య = శిష్యులలో; పుత్ర = పుత్రులలో; వరులన్ = ఉత్తములను; యోగ = యోగముతోటి; యుతులన్ = కలిగినవారిగా; చేయన్ = చేయుట; ఒప్పు = చక్కగా; కావలయును = కావలెను కాని; కర్మ = కర్మలందు; పరులన్ = లగ్నమైనవారినిగా; చేయన్ = చేయుట; కాదుకాదు = సరికానేకాదు; =

భావము:- ఇటువంటి యోగాన్ని అనుష్ఠించే వ్యక్తి గురువైతే శిష్యులను, తండ్రి అయితే బిడ్డలను, రాజు అయితే ప్రజలను తాను నేర్చిన యోగమార్గంలో పెట్టాలి కాని కర్మఫలాలపై ఆసక్తులను చేయకూడదు.

5.1-72-సీ.

జనులెల్ల నర్థ వాంఛలఁ జేసి యత్యంత;
మూఢులై యైహికంబులు మనంబు
లందును గోరుదు; రల్ప సౌఖ్యములకు-
నన్యోన్యవైరంబు లంది దుఃఖ
ములఁ బొందుదురు; గాన మునుకొని గురుఁ డైన-
వాఁడు మాయామోహవశుఁడు నెంత
జడుఁడు నైనట్టి యా జంతువునందును-
దయ గల్గి మిక్కిలి ధర్మబుద్ధిఁ

5.1-72.1-ఆ.

గన్ను లున్నవాఁడు గానని వానికి
దెరువుఁ జూపి నట్లు దెలియఁ బలికి
యతుల మగుచు దివ్యమైన యా మోక్ష మా
ర్గంబుఁ జూప వలయు రమణతోడ.

టీక:- జనులు = ప్రజలు; ఎల్లన్ = అందరు; అర్థ = ప్రయోజనములందలి; వాంఛలన్ = కోరికల; చేసి = వలన; అత్యంత = మిక్కిలి; మూఢులు = మూర్ఖులు; ఐ = అయ్యి; ఐహికంబులు = ఇహలోకపు ప్రయోజనములు; మనంబునన్ = మనసులు; అందునున్ = లలో; కోరుదురు = ఆశించెదరు; అల్ప = నీచమైన; సౌఖ్యముల్ = సుఖకరముల; కున్ = కొరకు; అన్యోన్య = వారిలోవారికి; వైరంబున్ =

శత్రుత్వమును; అంది = చెంది; దుఃఖములన్ = దుఃఖములను; పొందుదురు = పొందుతారు; కాన = కావున; మునుకొని = పూనుకొని; గురుడున్ = గురువు; ఐన = అయిన; వాడు = వాడు; మాయా = మాయవలన; మోహ = మోహమునకు; వశుడున్ = లొంగిపోయినవాడూ; జడుడున్ = తెలివితక్కువవాడూ; ఐనట్టి = అయినటువంటి; ఆ = ఆ; జంతువున్ = పశుప్రాయుని; అందునున్ = ఎడల; దయ = కృప; కల్గి = కలిగి; మిక్కిలి = అధికమైన; ధర్మబుద్ధిన్ = ధర్మబుద్ధితో; కన్నులు = కళ్ళు; ఉన్నవాడు = కలవాడు; కాననివాని = అంధుని; కిన్ = కి; తెరువున్ = దారి; చూపినట్లు = చూపెడి విధముగా; తెలియన్ = తెలిసేటట్లు; పలికి = చెప్పి. = = అతులము = సాటిలేనిది; అగుచున్ = అగుచూ; దివ్యము = దివ్యము; ఐన = అయిన; ఆ = ఆ; మోక్ష = ముక్తిని చెందించు; మార్గంబున్ = దారిని; చూపవలయున్ = చూపించవలెను; రమణ = ప్రీతి; తోడన్ = తోటి.

భావము:- ప్రజలంతా ఏవో ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని మూర్ఖులై ఎల్లప్పుడూ మనసులో ఐహిక ఫలాలను కోరుతూ ఉంటారు. అల్పసుఖం కోసం ఒకరిపై మరొకకు వైరం పెంచుకుంటారు. అంతులేని దుఃఖంలో మునిగిపోతారు. అందుచేత గురువయినవాడు తానే ముందు నడిచి మాయా మోహాలకు లోబడిన మూర్ఖులైన జీవుల పట్ల సానుభూతి చూపాలి. కళ్ళున్నవాడు గ్రుడ్డివానికి దారి చూపిన విధంగా అజ్ఞానులకు బోధించి సహాయపడాలి. సాటి లేనిది, దివ్యమైనది అయిన మోక్షానికి మార్గం చూపాలి.

## 5.1-73-వ.

మఱియుఁ బితృ గురు జననీ బంధు పతి దైవతంబులలో నెవ్వ రైనను సంసార రూప మృత్యు రహితం బైన మోక్షమార్గంబుం జూపకుండిరేని వారెవ్వరును హితులు గా నేరరు; నాదు

శరీరంబు దుర్విభావ్యంబు; నాదు మనంబు సత్త్వయుక్తం బును, ధర్మసమేతంబును, బాపరహితంబు నగుటంజేసి పెద్దలు నన్ను ఋషభు డండ్రు; గావున శుద్ధ సత్త్వమయం బైన శరీరంబునం బుట్టిన కుమారులైన మీర లందఱును సోదరుం డును మహాత్ముండును నగ్రజుండును నైన భరతు నన్నెకాఁ జూచి యక్లిష్టబుద్ధిచే భజింపుం; డదియ నాకు శుశ్రూషణంబు; ప్రజాపాలనంబు చేయుట మీకును బరమధర్మం"బని మఱియు నిట్లనియె.

టీక:- మఱియున్ = ఇంకను; పితృ = తండ్రి; గురు = గురువు; జననీ = తల్లి; బంధు = బంధువు; పతి = భర్త; దైవతంబుల్ = దైవత్వము గలవారల; లోన్ = అందు; ఎవ్వరైనను = ఎవరైన సరే; సంసార = సంసార యొక్క; రూప = రూపములో ఉన్న; మృత్యు = మృత్యువు; రహితంబు = లేనిది; ఐన = అయిన; మోక్ష = ముక్తిని చెందించు; మార్గంబున్ = దారిని; చూపకుండిరేని = చూపనిచో; వారు = వారు; ఎవ్వరును = ఎవరూ కూడ; హితులు = మంచి కోరువారు; కానేరరు = కాలేరు; నాదు = నా యొక్క; శరీరంబున్ = దేహము; దుర్విభావ్యంబున్ = భావింపలేనిది; నాదు = నా యొక్క; మనంబున్ = మనసు; సత్త్వ = సత్త్వగుణముతో; యుక్తంబునున్ = కూడినది; ధర్మ = ధర్మముతో; సమేతంబునున్ = కూడినది; పాప = పాపములు; రహితంబున్ = లేనిది; అగుటన్ = అగుట; చేసి = వలన; పెద్దలు = పెద్దవారు; నన్నున్ = నన్ను; ఋషభుడు = ఋషభుడు; అండ్రు = అనెదరు; కావునన్ = అందుచేత; శుద్ధ = పరిశుద్ధమైన; సత్త = సత్త్వగుణముతో; మయంబున్ = కూడినది; ఐన = అయిన; శరీరంబునన్ = దేహము నందు; పుట్టిన = జన్మించిన; కుమారులు = పుత్రులు; ఐన = అయిన; మీరలు = మీరు; అందఱును = అందరూ;

సోదరుండును = సహోదరుడు; మహాత్ముండునున్ = గొప్పవాడు; అగ్రజుండునున్ = అన్నగారు {అగ్రజుడు – ముందు పుట్టినవాడు, అన్న}; ఐన = అయిన; భరతున్ = భరతుడిని; నన్నె = నేను; కాన్ = అగునట్లు; చూచి = చూసి; అక్లిష్ట = శిథిలము గాని; బుద్ధి = బుద్ధి; చేన్ = తోటి; భజింపుండు = సేవించండి; అదియ = అదే; నాకున్ = నాకు; శుశ్రూషణంబు = సేవించుట; ప్రజా = ప్రజలను; పాలనంబున్ = పరిపాలించుట; చేయుట = చేయుట; మీకునున్ = మీకు కూడ; పరమ = అతి ముఖ్యమైన; ధర్మంబున్ = ధర్మము; అని = అని; మఱియున్ = ఇంకనూ; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఇంకా తండ్రి, గురువు, తల్లి, బంధువు ఎవరైనా సరే అక్షయమైన మోక్షమార్గం చూపలేక పోతే వారెవరూ హితులు కారు. నా శరీరం ఎలా ఏర్పడించో మీరు ఏమాత్రం ఊహించలేరు. నా మనస్సు సత్త్వగుణంతోను, ధర్మంతోను కూడి పాపరహితమైనట్టిది. అందువల్లనే ఆర్యులు నన్ను ఋషభుడు అన్నారు. శుద్ధ సాత్త్వికమైన నా శరీరంనుండి కుమారులై పుట్టిన మీరందరూ తోడబుట్టినవాడు, మీకు పెద్దవాడు, మహాత్ముడు అయిన భరతుణ్ణి నాలాగే భావించి సద్బుద్ధితో సేవించండి. అదే మీరు నాకు చేసే శుశ్రూష. ప్రజలను పరిపాలించడమే మీకు పరమధర్మం" అని చెప్పి మళ్ళీ ఇలా అన్నాడు.

5.1-74-సీ.

భూతజాలములందు భూజముల్ వర్యముల్-
భూరుహముల కంటె భోగి కులము
భోగి సంతతి కన్న బోధనిష్ఠులు బోధ-
మాన్యుల కన్నను మనుజవరులు
వీరికన్నను సిద్ధ విబుధ గంధర్వులు-
వారి కన్న నసురుల్ వారి కన్న
నింద్రాది దేవత లిందఱి కన్నను-
దక్షాది సన్మును ల్దలఁప నెక్కు

5.1-74.1-తే.

డంతకన్నను భర్గుఁ డా యభవు కన్నఁ
గమలభవుఁ డెక్కుఁ; డాతని కంటె విష్ణుఁ
డధికుఁ; డాతఁడు విప్రుల నాదరించుఁ
గాన విప్రుండు దైవంబు మానవులకు.

టీక:- భూత = ప్రాణి; జాలము = కోట్ల; అందున్ = లో; భూజముల్ = చెట్లు {భూజము - భూమి యందు జము (పుట్టినది), చెట్టు}; వర్యముల్ = ఉత్తమములు; భూరుహముల్ = చెట్ల {భూరుహము - భూమి యందు పుట్టినది, చెట్టు}; కంటెన్ = కంటె; భోగి = సర్పము, సుఖదుఃఖములు అనుభవించెడి జీవుల; కులము = సమూహములు; భోగి = భోగుల; సంతతి = కులము; కన్నన్ = కంటె; బోధనిష్ఠులు = తెలివిగలవారు; బోధమాన్యులు = తెలివిగలవారు; కన్నను = కంటె; మనుజవరులు

= రాజులు; వీరి = వీరి; కన్నను = కంటె; సిద్ధ = సిద్ధులు; విబుధ = జ్ఞానులు; గంధర్వులు = గంధర్వులు; వారి = వాళ్ళ; కన్నన్ = కంటెను; నసురుల్ = రాక్షసులు; వారి = వారి; కన్నన్ = కంటె; ఇంద్ర = ఇంద్రుడు {ఇంద్రుడు - ఇంద్రియములకు అధిపతి, దేవేంద్రుడు}; ఆది = మొదలగు; దేవతలున్ = దేవతలు; ఇందఱి = వీరందరి; కన్నను = కంటెను; దక్ష = దక్షుడు; ఆది = మొదలగు; సత్ = సత్యమైన; మునుల్ = మునులు; తలపన్ = ఆలోచించిచూసిన; ఎక్కుడు = ఎక్కువ; అంతకన్నను = అంతకంటె.

భర్గుడు = శివుడు {భర్గుడు - భరించువాడు, శివుడు}; ఆ = ఆ; అభవున్ = శివుని {అభవుడు - భవము (పుట్టుక) లేనివాడు, శివుడు}; కన్నన్ = కంటె; కమలభవుడున్ = బ్రహ్మదేవుడు {కమలసంభవుడు - కమలమున సంభవుడు (పుట్టినవాడు), బ్రహ్మ}; ఎక్కుడు = ఎక్కువ; ఆతని = అతని; కంటెన్ = కంటె; విష్ణుడు = విష్ణుమూర్తి; అధికుడు = గొప్పవాడు; ఆతడు = అతడు; విప్రులన్ = బ్రాహ్మణులను; ఆదరించున్ = గౌరవించును; కానన్ = కావున; విప్రుండు = బ్రాహ్మణుడు; దైవంబున్ = దైవము; మానవుల = మనుష్యుల {మానవులు - మనువు నుండి పుట్టినవారు, మనుష్యులు}; కును = కు.

భావము:- సమస్త జీవరాసులలో వృక్షాలు శ్రేష్ఠమైనవి. వృక్షాలకంటె సర్పాలు శ్రేష్ఠాలు. సర్పాలకంటె మేధావులు ఉత్తములు. వారికంటె రాజులు గొప్పవారు. రాజులకంటె సిద్ధులు, కింపురుషులు, గంధర్వులు శ్రేష్ఠులు. వారికంటె రాక్షసులు గొప్పవారు. వారికంటెను ఇంద్రాది దిక్పాలకులు గొప్పవారు. వారికంటె దక్షుడు మొదలైన మునులు గొప్పవారు. వారికంటె రుద్రుడు, రుద్రునికంటె బ్రహ్మ, బ్రహ్మకంటె విష్ణువు అధికులు. విష్ణువు బ్రాహ్మణులను ఆదరిస్తాడు. అందుచేత మానవులకు బ్రాహ్మణుడే దైవం.

5.1-75-క.

భూసురులకు సరి దైవం

బీ సచరాచరమునందు నెఱుఁగను; నాకున్

భూసురులు గుడుచు నప్పటి

యా సంతోషంబు దోఁప దగ్నులయందున్.

టీక:- భూసురుల్ = బ్రాహ్మణుల; కున్ = కు; సరి = సాటి; దైవంబున్ = దైవమును; ఈ = ఈ; సచరాచరమున్ = ప్రపంచము {సచరాచరము - స (కలిసి యున్న) చర (కదలికగలవి) అచర (కదలికలేనివి) కలది, ప్రపంచ మంతయు}; అందున్ = లోను; ఎఱుగను = తెలియదు; నా = నా; కున్ = కు; భూసురుల్ = బ్రాహ్మణులు; కుడుచున్ = భుంజించెడి; అప్పటి = ఆ సమయము నందలి; ఆ = ఆ; సంతోషంబున్ = సంతోషము; తోపదున్ = తోచదు; అగ్నులన్ = అగ్నిహోత్రమున సమర్పించుట; అందున్ = అందు

భావము:- ఈ చరాచర ప్రపంచంలో బ్రాహ్మణులకు సాటి అయిన దైవాన్ని నేనెరుగను. బ్రాహ్మణులు భోజనం చేస్తుంటే నాకు కలిగే సంతోషం విధి విహితంగా అగ్నులలో వేల్చే హవిస్సు వల్ల కలుగదు.

5.1-76-సీ.

మంగళం బైన బ్రహ్మస్వరూపంబును-

వేదరూపంబు ననాది రూప

మగుచున్న నాదు దేహము బ్రాహ్మణోత్తముల్-

ధరియింతు రెప్పుడుఁ దత్త్వబుద్ధి

శమదమానుగ్రహ సత్యతపస్తితి-

క్షలు గల్గు విప్రుండు సద్గురుండు;

గాన మిక్కిలి భక్తిగల్గి యకించను-

లైన భూసురుల దేహముల వలన

5.1-76.1-తే.

నందుచుండును నాదు దేహంబు గాఁగ

నెఱిఁగి వరులగు విప్రుల నెల్ల భక్తిఁ

బూజ చేయుటయే నన్నుఁ బూజ చేయు

టనుచు వినిపించి మఱియు నిట్లనుచుఁ బలికె.

టీక:- మంగళంబున్ = శుభకరమైనది; ఐన = అయిన; బ్రహ్మ = పరబ్రహ్మ; స్వరూపంబును = స్వరూపము; వేద = వేదముల; రూపంబున్ = స్వరూపము; అనాది = మొదలులోనిది; రూపమున్ = స్వరూపమును; అగుచున్ = అగుచున్న; నాదు = నా యొక్క; దేహమున్ = శరీరము; బ్రాహ్మణ = బ్రాహ్మణులైన; ఉత్తముల్ = ఉత్తములు; ధరియింతురు = ధరించెదరు; ఎప్పుడున్ = ఎల్లప్పుడును; తత్త్వబుద్ధిన్ = తత్త్వస్వరూపమును తెలియు బుద్ధితో; శమ = శాంతి; దమ = నిగ్రహము; అనుగ్రహ

= దయచూపుట; సత్య = సత్యము; తపస్ = తపస్సు; తితిక్ష = ఓర్పు; కల్గు = కలిగిన; విప్రుండు = బ్రాహ్మణుడు; సత్ = సత్యమైన; గురుండు = గురువు; కానన్ = కావున; మిక్కిలి = అదికమైన; భక్తి = భక్తి; కల్గి = కలిగి; అకించనులు = దరిద్రుడు; ఐనన్ = అయినను; భూసురుల = బ్రాహ్మణుల; దేహమున్ = శరీరము; వలన = వలన; అందుచుండును = అందుతూనుండును.

నాదు = నా యొక్క; దేహంబున్ = శరీరము; కాగ = అగునట్లు; ఎఱిగి = తెలిసి; వరులు = శ్రేష్ఠులు; అగు = అయిన; విప్రులన్ = బ్రాహ్మణులను; ఎల్లన్ = అందరను; భక్తిన్ = భక్తితో; పూజచేయుటయే = పూజించుటే; నన్నున్ = నన్ను; పూజచేయుట = పూజించుట; అనుచున్ = అనుచూ; వినిపించి = చెప్పి; మఱియున్ = ఇంకను; ఇట్లు = ఈ విధముగ; అనుచున్ = అనుచూ; పలికె = పలికెను.

భావము:- నా దేహం శుభప్రదమైన పరబ్రహ్మ స్వరూపం, వేదమయం. దీనికి ఆది లేదు. అలాంటి వేదమయమైన నా దేహాన్ని బ్రాహ్మణోత్తములు ధరిస్తారు. సత్త్వగుణం కలిగినవాడు, జితేంద్రియుడు, దయాళువు, సత్యసంధుడు, తపస్వి, సహనశీలి అయిన బ్రాహ్మణుడే మంచి గురువు. అందుచేత నేను పరమభక్తులు, మహానుభావులు అయిన బ్రాహ్మణుల దేహంతో కనిపిస్తూ ఉంటాను. పైన చెప్పిన గుణాలు కలిగిన బ్రాహ్మణులను నా రూపంగా భావించుకొని పూజ చేయడం నన్ను పూజ చేయడమే అవుతుంది" అని మళ్ళీ ఇలా అన్నాడు.

## 5.1-77-క.

ఈ తెఱఁగుఁ దెలిసి భూసుర
జాతిం బూజించునట్టి జనుఁడును మాయా
తీతుండై నిక్కంబుగ
భూతలమున మోక్షమార్గమును బొడగాంచున్.

టీక:-    ఈ = ఆ; తెఱగున్ = విధమును; తెలిసి = తెలిసికొని; భూసురజాతిన్ = బ్రాహ్మణజాతిని; పూజించు = పూజించెడి; అట్టి = అటువంటి; జనుడును = మానవుడు; మాయా = మాయ యొక్క ప్రభావమునకు; అతీతుండు = అతీతమైనవాడు; ఐ = అయ్యి; నిక్కంబుగన్ = నిజముగ; భూతలమునన్ = భూమండలముపైన; మోక్ష = ముక్తి; మార్గమును = దారిని; పొడగాంచున్ = దర్శించగలుగును.

భావము:-    ఈ రహస్యం తెలుసుకొని బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణులను పూజించే మానవుడు మాయాతీతుడై భూలోకంలోనే మోక్షానికి మార్గాన్ని తెలుసుకుంటాడు.

## పూర్ణి

### 5.1-183-మాలి.

సరసహృదయవాసా! చారులక్ష్మీవిలాసా!
భరితశుభచరిత్రా! భాస్కరాబ్జారినేత్రా!
నిరుపమఘనగాత్రా! నిర్మలజ్ఞానపాత్రా!
గురుతరభవదూరా! గోపికాచిత్తచోరా!

టీక:-    సరసహృదయవాసా = శ్రీకృష్ణ {సరస హృదయ వాసా - సరసుల హృదయము లందు వసించెడివాడ, శ్రీకృష్ణ}; చారులక్ష్మీవిలాసా = శ్రీకృష్ణ {చారులక్ష్మీ విలాసా - చారు (అందమైన) లక్ష్మీ (లక్ష్మీకళతో) విలాసిల్లెడివాడ, శ్రీకృష్ణ}; భరితశుభచరిత్రా = శ్రీకృష్ణ {భరిత శుభచరిత్రా - భరిత (నిండైన) శుభచరిత్ర కలవాడ, శ్రీకృష్ణ}; భాస్కరాబ్జారినేత్రా = శ్రీకృష్ణ {భాస్కరాబ్జారి నేత్రా - భాస్కర (సూర్యుడు) అబ్జారి (పద్మములకు శత్రువైన చంద్రుడు) వంటి నేత్రా (కన్నులు కలవాడ), శ్రీకృష్ణ}; నిరుపమఘనగాత్రా = శ్రీకృష్ణ {నిరుపమ ఘన గాత్రా - నిరుపమ

(సాటిలేని) ఘన (గొప్ప, మేఘముల వంటి) గాత్ర (శరీరము కలవాడ), శ్రీకృష్ణ};
నిర్మలజ్ఞానపాత్రా = శ్రీకృష్ణ {నిర్మల జ్ఞాన పాత్రా - నిర్మల (స్వచ్ఛమైన) జ్ఞానముచే పాత్ర (తగినవాడ), శ్రీకృష్ణ}; గురుతరభవదూరా = శ్రీకృష్ణ {గురుతర భవదూరా - గురుతర (మిక్కిలి భారమైన) భవ (సంసారబాధలను) విదూర (తొలగించువాడ), శ్రీకృష్ణ}; గోపికా చిత్తచోరా = శ్రీకృష్ణ {గోపికాచిత్తచోరా - గోపికల చిత్తములను దొంగిలించినవాడ, శ్రీకృష్ణ}; = {గురు - గురుతరము -గురుతమము}

భావము:- సరసుల హృదయాలలో నివసించేవాడా! అందమైన లక్ష్మీకళతో విలసిల్లేవాడా! గొప్ప శుభచరిత్ర కలవాడా! సూర్య చంద్రులు కన్నులుగా గలవాడా! సాటిలేని మేఘం వంటి శరీరం కలవాడా! స్వచ్ఛమైన జ్ఞానంతో ఒప్పేవాడా! గొప్ప సంసార భారాన్ని దూరం చేసేవాడా! గోపికల మనస్సులను దొంగిలించినవాడా! కృష్ణా!

## 5.1-184-గ.

ఇది సకల సుకవిజనానందకర బొప్పనామాత్యపుత్ర గంగనార్య ప్రణీతంబైన శ్రీ మహాభాగవతపురాణమునందు **పంచమ స్కంధంలో ప్రథమాశ్వాసం నందలి** ఋషభుని జన్మంబును, ఋషభుని రాజ్యభిషేకం బును, భరతుని జన్మం బును, ఋషభుని తపంబునను కథలు గల ఋషభోపాఖ్యానంబు సుసంపూర్ణము.

టీక:- ఇది = ఇది; సకల = అఖిలమైన; సు = మంచి; కవి = కవులైన; జన = వారికి; ఆనంద = ఆనందమును; కర = కలిగించెడి; బొప్పనామాత్య = బొప్పనామాత్యుని; పుత్ర = పుత్రుడు; గంగన = గంగన యనెడి; ఆర్య = ఉత్తమునిచే; ప్రణీతంబు = సంస్కరింపబడినది; ఐన = అయినట్టి; శ్రీ = శుభకరమైన; మహా = గొప్ప; భాగవత = భాగవతము అనెడి; పురాణము = పురాణము; అందున్ = లో; పంచమ స్కంధంలో = ఐదవ స్కంధము లోని; ప్రథమాశ్వాసం = మొదటి ఆశ్వాసము; నందలి = లోని;

ఋషభుని = ఋషభుని యొక్క; జన్మంబునున్ = పుట్టుక; ఋషభుని = ఋషభుని యొక్క; రాజ్య = రాజ్యమునకు; అభిషేకంబునున్ = పట్టాభిషేకము; భరతుని = భరతుని యొక్క; జన్మంబునున్ = పుట్టుక; ఋషభుని = ఋషభుని యొక్క; తపంబున్ = తపస్సును; అను = అనెడి; కథలు = వృత్తాంతములు; కల = ఉన్నట్టి; ఋషభోపాఖ్యానంబు = ఋషభుని చరితము; సుసంపూర్ణము = సమాప్తము.

భావము:- ఇది సకల సుకవులకు ఆనందాన్ని కలిగించేవాడు, బొప్పనామాత్యుని కుమారుడు అయిన గంగనార్యుని చేత రచింపబడ్డ శ్రీ మహాభాగవత పురాణం నందలి పంచమ స్కంధంలో ప్రథమాశ్వాసం లోని ఋషభుని జననం, ఋషభుని పట్టాభిషేకం, భరతుని జననం, ఋషభుని తపస్సు అనే కథలు కలిగిన ఋషభోపాఖ్యానము సమాప్తం.

*ఓం నమో భగవతే వాసుదేవాయ!!*

*ఓం! ఓం! ఓం!*

*ఓం! శాంతిః! శాంతిః! శాంతిః!*

*సర్వే జనా స్సుఖినో భవతు!!*